# మా వూరి మంత్రిగారి శతకం

**మూలకథ : కలశపూడి శ్రీనివాసరావు :: నాటకీకరణ: విద్యాధర్ మునిపల్లె దర్శకత్వం : ఎస్.వెంకటేశ్వర్లు**

---

(అదొక మండువాలోగిలి వున్న ఇల్లు. ఒక వైపు బజారు. మరొక వైపు ఇల్లు. ఇలా డిజైన చేసుకోవాలి. కొంత భాగం సబ్జక్టు ఇంట్లోనూ, మరికొంత భాగం రోడ్డుమీదా జరుగుతుంటుంది. ఒకోసారి రోడ్డుమీదా ఇంట్లోనూ కూడా సన్నివేశాలు నడుస్తుంటాయి.) (రాత్రిపూట.. చలిగాలి వీస్తోంది. ఇంట్లో శ్రీనివాసరావు మాస్టారు ఒక్కరే వున్నారు. ఫోను మాట్లాడుతూ తన గదిలోంచి లోపలికి వచ్చారు మాస్టారు.)

శ్రీని : భోజనం చేశాను. ఆ..ఆ.. వంటింటి తలుపుకూడా వేశాను. కిటికీలన్నీ వేసినట్లే వున్నాను. ఆ వేశానులే.. చలా బానే వుంది. బయటికివెళ్ళట్లేదు. పెందలాడే ఇంటికొస్తున్నాను. ఆ వీధితలుపులు కూడా వేశాను. నువ్వు న్యూయార్క్ లో దిగావా.. వాడు వచ్చాడా.. వాడికివ్వు. ఆ.. ఒరేయ్ .. బాబీ.. మీ అమ్మ గురించి తెలిసిందేగా.. చెప్పిందే చెప్పి చంపేస్తుంది. నువ్వు పట్టించుకోవాకరా.. ఆ కోడలికీ, నీకూ తోడుగా వుంటుందని పంపించాలే.. కోడలు ఆరోగ్యం జాగ్రత్త.. బరువు పనులేం చేయించకు. నాకిక్కడేంలోటురా.. అంతగా ఇబ్బందైతే నేనూ అమెరికా వచ్చేస్తా.. సరే.. సరే.. పడుకుంటున్నాలే.. వుంటాను. అమ్మకా.. వద్దులేరా సామీ.. పడుకుంటున్నానని చెప్పు..(అక్కడ హాల్లో వేసున్న మంచంమీద కూలబడ్డాడు..) అన్నట్లు అన్ని తలుపులూ వేశానుగా.. ఒక్కసార చూసుకొస్తే పోయె.. (అన్ని తలుపులూ వేసున్నాయని రూఢీ చేసుకున్నాడు. వీధి తలుపు మాత్రం మైమ్ లో వుంది. దాన్ని కూడా వేసి వున్నట్లే చెక్ చేసి వెను తిరిగి వచ్చి పడుకున్నాడు. లైట్ తీశాడు మైమ్ లో.. స్టేజీ మొత్తం డిమ్ గా వుంటుంది. బయట చలిగాలి వీస్తోంది. దూరంగా పోలీసుల సైరన్ వినిపిస్తోంది. అతను గాఢమైన నిద్రలోకి వెళ్ళిపోయాడు. వీధిలో ఒక స్త్రీ తలమీద ముసుగుతో వచ్చింది. అటూ ఇటూ చూసింది. ఇంటి ముందున్న అరుగుమీద రచ్చబండలాంటి అరుగుమీద కూర్చుంది. ఆమెకి దాహమేస్తోంది. అటూ ఇటూ చూసింది. వేసిన తలుపులు చూసింది. తలుపు కొట్టాలా వద్దా అన్న మీమాంశతోనే ఏదైతే అదైందని తలుపు కొట్టింది. గాఢ నిద్రలో వున్న శ్రీనివాసరావుకి నిద్రాభంగం అయింది. విసుక్కుంటూ లేచాడు.)

శ్రీని : ఈ టైంలో ఎవరూ.. వేళాపాళా లేకుండా.. (తలుపు చప్పుడు అవుతూనే వుంది. దూరంగా పోలీసు సైరన్..) వస్తున్నా.. వస్తున్నా.. (లైటువేశాడు. తలుపు చప్పుడు ఆగిపోయింది. వీధిలో కూడా లైటు వేశాడు. తలుపు తీశాడు..) ఎవరూ?

స్త్రీ : దండాలు సామీ.. దప్పికగా వుంది. కాసిని నీళ్ళు పోస్తారా..(అంటూ తలమీద ముసుగు తొలగించింది)

శ్రీని : సరే.. వుండు.. వస్తాను.. (అతను లోపలికి వెళ్ళాడు. ఆమె నిలబడలేక వెళ్ళి అరుగుమీద కూర్చుంది. శ్రీనివాసరావు నీళ్ళు తీసుకొని వచ్చాడు. గడపలో లేదు.. అరుగుమీద కూర్చొని వుంది. శ్రీనివాసరావు ఆమె దగ్గరికెళ్ళి నీళ్ళిచ్చాడు. నీళ్ళు అందుకొని తాగింది. పొలమారింది.. నీళ్ళు చీరెమీద పడ్డాయి. ) నెమ్మదిగా తాగు.. (ఆమె నీళ్ళ బాటిల్ అతనికిచ్చేస్తూ.. రెండు చేతులూ ఎత్తి అతనికి దండం పెట్టింది.) భలేదానివే.. ఈ మాత్రానికే..

స్త్రీ : సానా అలసిపోనాను సామీ.. ఈ రేత్రికీడ్నే ఈ అరుగుమీద తొంగుని ఎవకల మా వూరెల్లిపోతాను సామీ..

శ్రీని : (ఆ స్త్రీని తేరిపార చూశాడు.) అలాగే పడుకో... (అంటూ లోనికి వెళ్ళాడు. అతను అరుగు మీద తన చెంగుతో దులుపుకొని పడుకునేందుకు ఉపక్రమించింది. ఇంతలో శ్రీనివాసరావు లోపలికి వెళ్ళి తలుపేసుకున్నాడు. తనలో.. ) బాగా ముసలిదానిలా వుంది. దగ్గరల్లో ఏదో పల్లెటూరి నుండి వచ్చి ఆఖరు బస్సు మిస్సయినట్లుంది. అయినా

బయట అరుగుమీద పడుకుంటానికి నా పర్మిషన్ దేనికి? పడుకుంటే నాకేం నష్టం. పాపం బాగా అలసిపోయినట్లుంది. ఏమైనా తిందో లేదో.. (మళ్ళీ తలుపు తెరుచుకొని వీధిలోకెళ్ళాడు.) చూడమ్మా.. నీ పేరేంటి?

స్త్రీ : రంగమ్మ.. ఈడకి దగ్గర్లోనే మా ఊరు. ఆకరి బస్సు అందుకోలేక పోయినా సామీ..

శ్రీని : అలాగా.. నేనూ అదే అనుకున్నాలే.. ఇంతకేమైనా తిన్నావాలేదా..?

రంగ : నేదు సామీ..

శ్రీని : ఒక్క నిమిషం..(లోపలికెళ్ళి తింటానికి బిస్కట్ ప్యాకెట్, మజ్జిక తెచ్చిచ్చాడు.) తీసుకో.. (రంగమ్మ వాటి వైపు చూస్తుంది.. కానీ తీసుకోలేదు. శ్రీనివాసరావుకి అర్థంకాలేదు. అతనూ బిస్కట్ ప్యాకెట్, మజ్జిగ వంక ఆమె వంకా చూస్తూ నిలబడ్డాడు.) తీసుకో రంగమ్మా.. ఇప్పటికీ బిస్కట్టులూ, మజ్జిగే వున్నాయి.. ఇవి తిని మజ్జిగ తాగి పడుకో.. (రంగమ్మ ఏమీ మాట్లాడలేదు. తల వంచుకొని కూర్చుంది. వారిద్దరి మధ్యా మౌనం.. ఇక శ్రీని వాసరావు కూడా చేసేదేమీ లేక తనూ అరుగుమీద కూర్చున్నాడు.. రంగమ్మ తలెత్తి శ్రీనివాసరావుని చూసింది. తీసుకో అన్నట్లు సైగ చేశాడు.)

రంగ : (శూన్యమైన చూపుతో..) సానా పొద్దుపోనాది తమకి.. ఎల్లి తొంగోండి సామీ..

శ్రీని : నువ్వు తిన్నాక నేను వెళతాను.

రంగ : నా మనసేటి బాగానేదు సామీ.. తమరెల్లి తొంగోండి.. (శ్రీనివాసరావు అక్కడి నుండి లేచాడు. లోపలికి నడిచాడు. రంగమ్మ పడుకునేందుకు సిద్ధమైంది. శ్రీనివాసరావు లోపలికెళ్ళి తలుపేసుకొని లైటు తీసి పడుకున్నాడు.. రంగమ్మ కూడా పడుకుంది. శ్రీనివాసరావు అటూ ఇటూ దొర్లుతూ వున్నాడు.. వున్నట్లుండి మళ్ళీ లేచి కూర్చున్నాడు..)

శ్రీని : ఛీ.. ఛీ.. ఒక మనిషి కష్టాల్లో వున్నానంటే ఊరడించకుండా లోపలికి రావటమేంటి? పైగా బయట చలి కూడా ఎక్కువగా వుంది. దుప్పటి.. ఆ దుప్పటిచ్చి ఆమె బాధేంటో తెలుసుకుంటాను. (దప్పటి తీసుకొని బయటికి వచ్చాడు. శ్రీనివాసరావుని చూస్తూనే రంగమ్మ మళ్ళీ లేచి కూర్చుంది. దుప్పటి చేతికిస్తూ.. తీసుకోమన్నట్లుగా సైగ చేశాడు. రంగమ్మ దుప్పటి తీసుకోవాలా వద్దా అని ఆలోచిస్తుంటే...) తీసుకో.. దుప్పటి మంచిదే.. చలిగా వుంది కదా.. పైగా బయట పడుకుంటున్నావు.. కప్పుకో.. వెచ్చగా వుంటుంది. పోనీ లోపలికొచ్చి పడుకుంటావా...? నేను తప్ప ఇంట్లో ఎవ్వరూలేరు. (తల అడ్డంగా వూపింది..) ఇక్కడే పడుకుంటావా... (అవునన్నట్లుగా తలూపింది.) సరే.. ఈ దుప్పటి తీసుకో... రేపు ఉదయానే వెళ్ళాలంటున్నావ్. దుప్పటి కప్పుకోకపోతే ఈ చలికి గడ్డకట్టుకు పోతావ్.. (దుప్పటి తీసుకుంది.) కప్పుకో... (కప్పుకుంది.) ఇప్పుడు చెప్పు రంగమ్మా.. ఏంటి సంగతి? ఏమైంది? (తలవంచుకుంది.) చూడు రంగమ్మా.. నీ మౌనం వల్ల నీ బాధ లోపలే వుండిపోతుంది. అంతకంతకూ ఎక్కువవుతుంది. అదే బాధని పంచుకుంటే మనసు తేలికవుతుంది. ఒకవేళ నీ బాధ పోటానికి నేను నీకేమైనా సాయం చెయ్య గలనేమో.. (ఆశగా అతని వైపు చూసింది...) చెప్పురంగమ్మా.. తోబుట్టువుని అనుకొని చెప్పు.. (పెద్దగా ఏడ్చింది... శ్రీనివాసరావుకి ఏం చెయ్యాలో అర్థంకాలేదు.) నువ్వలా ఏడిస్తే నీబాధ తీవ్రత అర్థమౌతుంది కానీ నీ బాధ నాకెలా అర్థమౌతుంది. కాస్త అర్థమయ్యేలా చెప్పు..

రంగ : ఏటి సెప్పను సామీ... మా ఇంటాయన తాత ముత్తాతలు కూలి నాలీ సేసుకొని పుష్కరానికొక ఎకరం పొలంకొని రైతులయ్యేరు. మా ఆయన కాడికొచ్చేపాటికి పదెకరాల పొలంతో సిన్న యవసాయ దారుడిగా నిలబడ్డాం. ఒక్కగానొక్క కొడుకు మల్లేశం. ఆడిసిన్నతనంలో మా ఊర్లో ఎలచ్చన్లొచ్చాయ్.. రెండు పార్టీల మద్దే జరిగిన గొడవల్లో ఒకళ్ళనొకళ్ళు నరుక్కున్నారు. ఆ గొడవల్లో మా ఇంటాయిన సచ్చిపోనాడు సామీ..

శ్రీని : అయ్యయ్యో... (రంగమ్మ, శ్రీనివాసరావుల మీద స్పాట్ ఆన్ అయింది.)

రంగ : అయినా నేనేం భయపడ్లేదు సామీ.. యవసాయం సేసీ.. నా రెక్కలు ముక్కలు సేసుకునైనా నా బిడ్డకి సదువు సెప్పించి మంచి ఉద్దోగత్తున్ని సెయ్యాలనుకున్నా.. ఆడూ బాగా కట్టబడి సదివి పట్టుమార్కులు తెచ్చుకుండాడు. ఆడి సదువులకోసం పొలాలు తాకట్టు పెట్టి సదివిపిచ్చా సామీ.. సదువై రెండేల్లయినా ఆడికి ఉద్దోగం రాలే.. అప్పులోల్లకి నా కొడుక్కి ఉద్దోగమొచ్చిదన్న ఆశపోనాది. పొలమమ్మి బాకీ తీరుత్తావాలేదా అని పీకల మీద కూకుండారు సామీ...

శ్రీని : మరేం చేశావ్...

రంగ : ఏటి సెయ్యల్రా భగమంతుడా అని ఆలోసిత్తంటే ఆరోజాడొచ్చాడు. ఆడు రాటంతోనే మా జీవితాల్లో ఊహించని మార్పులొచ్చేసాయి సామీ...(ఫ్లాష్ బ్యాక్)

## 2 వ సీన్

## రంగమ్మ ఇల్లు

(అదొక మండువాలోగిలున్న ఇల్లు.. ఆ ఇంట్లో రంగమ్మ పరధ్యానంగా చేటలో బియ్యం ఏరుతోంది. ఆమెకి ... అప్పులవాళ్ళ మాటలు వినిపిస్తుంటాయి..)

1 ఓ.బీ : నీ కొడుక్కి ఉద్యోగం వచ్చేది లేదు.. సచ్చేది లేదూ... బాకీ తీరుత్తావా లేదా...

2 ఓ.బీ : తీర్చలేనప్పుడు బాకీలు చెయ్యటందేనికి.. మమ్మల్నిట్టా పీడిచ్చటం దేనికీ...

రంగ : తీరుత్తా.. అందరి బాకీలూ తీరుత్తా.. అట్టా తీర్చాకే నేను పోతా... రంగమ్మంటే ఏటనుకున్నార్రా.. భయపెడితే భయపడే రకంకాదు.. ఆ భయానికే ఎదురెల్లే ఢీకొట్టే రకం.. రేయ్.. రేయ్.. ఒకప్పుడు నాముంగట నోరెత్తటానిక్కూడా భయపడేటోల్లు, ఈ రోజు నాముందే ఇట్టమొచ్చినట్టు మాట్టాడతన్నార్రా.. ఒరేయ్.. రోజులెప్పుడూ ఒకేలా వుండవురా.. మారతాయ్.. నా మల్లేశానికి ఉద్దోగం వచ్చిద్ది.. పెద్ద ఆపీసరౌతాడు.. అప్పుడు ఆడికాడ మీరంతా సేతులు కట్టుకొని నిలుసుంటారు. ఆరోజూ సూత్తారా... తీర్చేత్తా.. నా బిడ్డకి ఉద్దోగంరాగానే బాకీ తీర్చేత్తా..

రింగోడు : (ప్రవేశం) రంగమ్మత్తా..

రంగ : ఒరె.. రింగోడో.. అప్పటికీ ఇప్పటికీ ఏం మార్లా.. అట్టనే వున్నావ్..

రింగోడు : మారానత్తమ్మో.. సానా మారా..

రంగ : ఏం మారావ్.. అప్పట్లో అన్నా నయం.. కనీసం పిల్ల పీకటానికి కండన్నావుండేది.. ఇప్పుడదీ లేదు..

రింగోడు : ఆకారంతో ఏంలే అత్తమ్మో... మన బ్యాగ్రౌండ్ బెమ్మానంగా వుంటేనూ...

రంగ : ఆ నీపాడె.. నువ్వూ నీ బడాయికూతలూ.. ఏం మార్లా..

రింగోడు : బడాయికాదత్తమ్మో.. పెద్ద పెద్ద లడాయిల్నే తెగ్గొడతన్నా.. ఇప్పుడు నేనెవర్ననుకున్నావ్.. మంత్రిగారి పిఏ గార్ని..

రంగ : నిన్ను పిఏగా పెట్టుకున్న ఆ పిచ్చి మంత్రెవడ్రా..

రింగోడు : మనూరి మంత్రే.. నాపేరేంది రింగోడు.. నేను చేసేదేంది.. మంత్రిగారి మూడ్ ని బట్టి టెలిఫోన్లో అవతలోల్లకి రింగులిత్తంటా.? ఆయన మాట్టాడతంటారు..

రంగ : ఆయన మాట్టాడ్డం బానే వుంది.. నీకేమైనా ఇత్తాడా లేదాని..

రింగోడు : మరదే.. జీతం తక్కువే కానీ పైనెక్కువే మిగులుతాయిలే అత్తమ్మా..

రంగ : ఎంతేంటి?

రింగోడు : జీతంతో కలుపుకొని నెలకి యాభై యేలు దాకా వత్తాయి.

రంగ : యాభై ఏలా..?

రింగోడు : మరేందనుకున్నా.. మంత్రిగారి పిఎ గారంటే.. ఏ పని జరగాలన్నా ఫైలు మనకాడ్నించే పోవాల.. మంత్రిగోరు సంతకాలెట్టాలంటే మనందగ్గరుండి పెట్టియ్యాల.. ఫైలుమీద సంతకం పెట్టిత్తే ఇంత.. మంత్రిగారి కాడికి ఫైలు పోవాలంటే ఇంతని కొన్నికొన్ని ఫిచ్చిడు రేట్లుంటాయిలే..

రంగ : అయితే మనకులపోడు మంత్రి బానే సంపాదిత్తన్నాడన్నమాట... ఒరేయ్.. ఒరేయ్.. రింగోడా.. నాకోసిన్న సాయం సేసిపెట్టకూడదూ..

రింగోడు : నువ్వట్టా సాయం సెయ్యమని నన్నడగ్గూడదత్తమ్మా.. పనిసెయ్యరా అంటే సేసిపెట్టనూ...

రంగ : అట్టయితే .. యిన్రా.. మల్లేశంగాడి సదువులకి సానా కర్చయింది. పొలాలు తాకట్టెట్టి మరీ సదివిపిచ్చా.. ఆడికా ఉద్యోగం రాకపాయె.. అప్పులోల్లు బాకీ తీర్చమంటా ఎంటబడుతుండార్రా..

రింగోడు : ఆపెయ్.. సెప్పద్దంతే ఆపెయ్.. నాకంతా అర్థమైంది. మన మల్లేశానికి ఉద్యోగం కావాల.. అంతేకదా..

రంగ : అవున్రా..

రింగోడు : అయితే కర్సవుద్దే.. అట్టా సూడమాక.. నాకర్సుకాదు.. మంత్రిగోరికి.. ఆయనియ్యాల్సినోల్లుకూడా సానామందుంటారు.

రంగ : అదేందిరా..? ఆయన మనకులపోడే కదరా.. మనోల్లకాడకూడా డబ్బులడుగుతుండాడా.?

రింగోడు : అడుగుతాడత్తమ్మా.. ఎవుర్నయినా అడుగుతాడు.. ఓట్లేమన్నా ఊరికే ఏశామా ఏంది? ఓటుకి ఐదొందలు తీసుకొని మరీ ఏశామాయె.. అయినా గమర్నమెంటుద్దోగమంటే సానా లెక్కలుంటాయి... అయన్నీ నీకు తెలవదు.. ఆలోసిచ్చుకో అత్తమ్మా.

రంగ : ఆలోసిచ్చేదేందిరా..? ఉద్దోగమొచ్చిద్దంటే.. ఏటైనా సేసేత్తా... మనోడికి ఉద్దోగం ముక్కెం.. ఏం సెయ్యాల..

రింగోడు : ఎట్టాగూ నీ పొలాలు తాకట్టులోనే వుండాయి కాబట్టి.. అయ్యేయో... బయటోల్లకి పొయ్యేకంటే మనకులపోడి కాడే వుంటే .. ఈరోజు కాకపోతే రేపు.. డబ్బులొచ్చాక కొనేసుకోవచ్చు.. ఏంటంటా?

రంగ : నువ్వనేదేందిరా..?

రింగోడు : అదే అత్తమ్మా.. నీ ఇల్లూ పొలాలేయో నేనే కొంటా.. మనోడికి ఉద్దోగమొచ్చాక ఎట్టాగూ రెండు సేతుల్తో సంపాదిత్తాడు.. ఆడు నా డబ్బులు నాకిచ్చేత్తాడు.. మీ ఇల్లూ పొలం మీకిచ్చేత్తాను.. ఆ తాకట్టేదో

ఆకులపోల్లకాడుండే బదులు అయినోడ్ని నాకాడుంటే భద్రంగా వుంటదికదాని.. పైగా నేనెంత సెప్తే మంత్రిగోరికి అంత.. దుడ్డు సంగతి నేను సూసుకుంటా.. ఆలోసిచ్చు..

రంగ : బానే వుందిరా... కానీ..

రింగోడు : అత్తమ్మా. అదృష్టం ఈరోజు నారూపంలో నీముంగిటికొచ్చింది.. అప్పులోల్లకాడికి పోదాంపా.. ఆల్ల ముక్కుమీద గుద్ది.. డబ్బులిచ్చి కాయితకాలిడిపిచ్చుకుందాం..

## లైట్స్ ఆఫ్

## 3వ సీన్

(మల్లేశం మంచంమీద కూర్చొని వుంటాడు.. రంగమ్మ అప్పుడే బయటి నుండి వస్తుంది.. తల్లిని చూస్తూనే అసహనంగా లేచినిలబడ్డాడు..)

రంగ : ఏందిరాయ్యా.. ఎప్పుడొచ్చినా..?

మల్లే : చాలా సేపైంది.. ఆ రింగోడు మనింటికొచ్చెల్లాడంట..

రంగ : అవున్రా.. బాకీలన్నీ తీర్చేసి పత్రాలిడిపిచ్చేడు.. నీకు గమర్నమెంటు ఉద్దోగం కూడా ఏపిత్తాడంట్రా..

మల్లే : వాడి సంగతి నీకు తెలీదు.. వాడు ఆ మంత్రిదగ్గర...

రంగ : నాకు తెలుసురా.. నాకన్నీ సెప్పినాడు.. ఆడట్టా సెప్పగానే అప్పులోల్లు నోరెత్తకుండా కాయితకాలు సేతిలో ఎట్టేసినారు.. ఈ ఇల్లు పొలం అన్నీ కూడా మన రింగోడికాడే తాకట్టెట్టినారా...

మల్లే : అదే చెప్తున్నా.. వాడు ఆ మంత్రికి తొత్తు... ఆడు మన పొలాల మీద కన్నేశాడు.

రంగ : మన రింగోడట్టాండు కాదురా..? ఆడి సంగతి నాకు బాగా తెలుసు...

మల్లే : తెలుసని నువ్వనుకుంటున్నావ్.. నీకేం తెలీదు..

రంగ : అవున్రా.. నాకేం తెలీదు సాలా..

మల్లే : నా ఉద్దేశం అది కాదమ్మా...

రంగ : నీ ఉద్దేశమేదైనా ఒరేయ్. అమ్మగా నాకు తెలిసిందేందో తెలుసా...? నా కొడుకు పెద్ద ఆఫీసరు కావాల.. రంగమ్మా.. నీ కొడుక్కి ఉద్దోగంరాదే.. అనోసరంగా ఆడ్ని సదివిపిచ్చావంటా అడ్డమైన కూతలు కూసిన ఆ నోల్లు, నవ్వినోల్లు తలలొంచుకోవాల..

మల్లే : అమ్మా.. అందుకని లంచం ఇచ్చి ఉద్యోగం కొనుక్కుంటామా అమ్మా...

రంగ : రేయ్.. మల్లేశమా.. ఈ సేతికి పెట్టటమే తప్ప తీసుకోటం తెలవదురా.. కానీ నీకోసం నేను తగ్గా.. నీ ఉద్దోగం కోసం మొదటిసారి ఈ రంగమ్మ ఆ రింగోడిముందు సెయ్యి సాచింది.. నువ్వన్నట్లు ఆడికి మనాత్తుల మీద కన్నుంటే ఉండనీ.. ఆత్తులు పోయాయా పోనీ.. కానీ నీకుద్దోగమొచ్చిద్ది కదయ్యా..

మల్లే : అట్టా ఉద్యోగం కొంటం నాకిష్టంలేదు..

రంగ : నలుగురికి మంచి చెయ్యాలంటే నువ్వు ఉద్దోగంలో సేరాల.. గమర్నమెంటాపీసరవ్వాల.. అప్పుడే కదరా.. మనలాటోల్లకి నువ్వు ఉపయోగపడేది.. సరైన సమయానికి విత్తనాలు రావు, బయట కొన్న ఇత్తనాలు

మొలకల్రావు, వచ్చినా కాపు అనుకున్నంతరాదు. ఎరువులూ, పురుగుల మందులు అవసరమయ్యే టయానికి రావు. ఈలోగా వచ్చిన కాపుకి గిట్టుబాటు ధరరాదు. సేసిన అప్పులకి వడ్డీలమీద వడ్డీలు.. కట్టలేని రైతు నడ్డి వంగుతుంది. సూపు బీటలు వారుతున్న నేలని సూత్తుంది.. ఒక్కోసారి ఆశగా ఆకాశంవంక సూత్తా.. దేవుడా నన్నెందుకిట్టా రైతులా పుట్టిచ్చావ్ అని అడగాలనిపిచ్చిద్ది.. కానీ యవసాయానికి అలవాటు పడ్డ ప్రాణం కదరా.. సాయం సెయ్యటమే తప్ప.. సాయం కోరటం రాదురా రైతులకి.. ఇది మనొక్కల్ల బతుకే కాదురా మల్లేశా.. మనలాంటి ఎంతో మంది బతుకు.. మన బతుకు రాత మార్చాలంటే.. నువ్వు పెద్ద గమర్నమెంటు ఆపీసరు కావాల.. దానికోసం నేనేటైనా సెయ్యటానకి సిద్ధంగా వుండా.. సేత్తా.. అవసరమైతే నాపేనాలైనా ఇత్తా..

మల్లే : నిన్ను చూస్తుంటే నాకు మాటలు రాటల్లేదమ్మా.. నువ్వనుకున్నట్లే నేను గవర్నమెంట్ ఆఫీసర్నవుతా.. మన రైతుల్ని ఆదుకుంటా.. వ్యవసాయానికి ఏం చెయ్యాలో అదే చేస్తా.. రైతు బాగుంటేనే దేశం బాగుంటుంది. లంచం ఇచ్చాను కదా నేను మాత్రం లంచం తీసుకోనమ్మా..

రింగోడు : (ప్రవేశిస్తాడు..) శబ్బాస్ రా.. మల్లేశమా.. శబ్బాస్.. అత్తమ్మా.. నువ్వీ కాగితకాల మీద సంతకమెట్టు.. అరే మల్లేశమా.. నువ్వూ ఎట్టరా...

మల్లే : పొలాలతోపాటు ఉన్న ఇల్లూ తీసేసుకుంటున్నావా బావా...

రింగోడు : ఏం సేత్తాంరా.. మనం మనం అయినోల్లం.. కానీ ఆపీసరవ్వాలంటే అవతలోడు మనకి అయినోడవ్వాలగా.. ఆడికి డబ్బిత్తేనే మనకుద్దోగమేపిత్తాడు.. ఆత్తులు నాకాడ్నే వుంటాయ్.. యాడికీ పోవు.. నువ్వు వడ్డీలేకుండా నీ డబ్బులిచ్చేయ్.. నీ ఆత్తులు నువ్వే తీసుకో.. ఏందత్తమ్మా. నేనెవర్ని..? సిన్నప్పటేల నుంచి నీసుట్టూ తిరిగినోడ్ని కదూ..

మల్లే : అవున్రా...ఒరేయ్ రింగూ... రైతు మట్టిలోనే బతుకుతాడు, ఆమట్టికి దైవంగా పూజచేస్తాడు, పైరుని ప్రాణంగా ప్రేమిస్తాడు.. తన చెమట చుక్కలతో నేలను తడుపుతాడు..నేల నుంచి సిరులు పండిస్తాడు... వాన చుక్క కోసం పడిగాపులు కాస్తాడు.. కరువు రక్కసితో నిరంతరం యుద్ధం చేస్తాడు.. కష్టపడి సాగుచేసినా గిట్టుబాటు ధరలేక రోధిస్తూకూడా... తన కడుపు మాడ్చుకొని అందరికీ అన్నంపెడతాడు.. తను మాత్రం పరువు కోసం పురుగు మందును పాయసంగా తీసుకుంటాడురా.. రైతు బతుకులు మారాల్సింది ఎక్కడో తెలుసా.. వ్యవసాయ క్షేత్రాల్లో.. మార్చాల్సింది.. నీ మినిష్టర్ లాంటి వాళ్ళు అసెంబ్లీల్లో... ఆ రైతులకోసమే.. నువ్వడిగినదానికల్లా తలూపి సంతకాలు పెడుతున్నా.. ఉద్దోగం రాకపోవాలా...

రింగోడు : వత్తదిరా.. వత్తది.. నేనున్నాగా.. నన్ను నమ్ము... (మల్లేశం.. రంగమ్మ ఇద్దరూ సంతకాలు పెడతారు.. రింగోడు కాగితాలు తీసుకొని వెళ్ళిపోతాడు..)

## 4వ సీన్

## మంత్రి మీద స్పాట్ ఆన్ అయింది

(మంత్రి మందుతాగుతుంటాడు.. రింగోడు కూర్చొని మందుపోస్తుంటాడు... రింగోడు కాగితాలు ఒక సినీవార పత్రిలో పెట్టి తీసి మంత్రి ముందు పెడతాడు.. మంత్రి తను తింటున్న మంచింగ్ కుక్కకి వేసినట్లు వేస్తాడు.. రింగోడు కుక్కలా దానిని చేతిలో పట్టుకొని మంత్రిముందు సాగిలపడతాడు.. మంత్రి సినిమా ఫోటో చూస్తూ...)

మంత్రి : తస్సాదియ్యా.. ఒరేయ్.. రింగూ.. ఎవర్రా ఇది...

రింగోడు : కొత్తగా వస్తోంది సార్.. హిందీ హీరో ఇన్.. బబితా పటేల్..

మంత్రి : ఎంతేంటి?

రింగోడు : సినిమాకి పాతిక లక్షలు దాకా తీసుకుంటుందంట సార్..

మంత్రి : తస్సాదియ్యా..నేనడుగుతోంది.. ఒక రోజుకి.. కాదురా.. ఒక వారానికి.. కాదురా నెలరోజులకి.. పదేనులచ్చలు.. తెగ్గొట్టు..

రింగోడు : ఒప్పుకోదేమోసార్..

మంత్రి : హహహ.. ఒప్పుకోదూ.. అదొప్పుకోదు.. ఒప్పుకుంటే మనముంది దేనికంటా... తస్సాదియ్యా.. పొడ్యూసరెవడూ...

రింగోడు : విజయ్ బాబనీ.. అప్పట్లో మన నియోజకవర్గంలో షూటింగ్ పర్మిషన్ అడిగాడు.. మీరేమో పదిలచ్చలు డిమాండ్ చేశారు సార్..

మంత్రి : ఆ బాబుకి రింగివ్వరా...? (రింగోడు రింగిచ్చాడు...) తస్సాదియ్యా.. ప్రొడ్యూసర్ విజయ్ బాబేనా.. నేను మంత్రిని.. గుర్తుపట్టవా.. అప్పుడెప్పుడో నువ్వు మనూర్లో షూటింగ్ చేసుకోటానికి పర్మిషన్ అడిగావంటా.. మా పిఎ గాడు.. కుక్క.. పది లక్షలు లంచం అడిగాడంట.. నాకిప్పుడే తెలిసింది.. తస్సాదియ్యా.. చెప్పుతో కొట్టా.. కళాకారులంటే ఎవర్రా.. వాళ్ళని మనం డబ్బులడిగేదేందీ.. అట్టాంటోళ్ళకి ఉచితంగా ఇయ్యాలని సెప్పా.. షూటింగెప్పుడు పెట్టుకుంటా.. హీరో ఇన్ ఇసయం నాకొదిలెయ్.. గెస్టు హౌస్ నాదిత్తా.. అట్టేనా.. నీ బొంబాయి హీరోఇన్ ఫోటో సూసా.. తస్సదియ్యా.. సానా బాగుంది కదూ.. రేపట్నుంచే ఈడ సూటింగు పెట్టు.. (కట్ చేశాడు..)

రింగోడు : మీరు మామూలు మంత్రి కాదుసార్..

మంత్రి : రేయ్.. సిన్నప్పుడే నేను మంత్రి అవ్వాలనుకున్నాన్రా.. అందుకే నా పేరే మంత్రి అని పెట్టుకున్నా.. తస్సాదియ్యా.. అదాడేడో బొంబాయిలో కూకుంటే నేనేం సేత్తాన్రా.. అందుకే మనూల్లో పెట్టా.. ఇక దాన్ని దార్లో పెట్టి నాదాకా తెచ్చే డూటీ నీకేత్తన్నా.. నాలుగు రోజుల్లో పనైపోవాల..

రింగోడు : మీకు దాని బాస రాదుకదసార్..

మంత్రి : తస్సాదియ్యా.. బాడీలు మాట్టాడుకోటానికి బాసతో సంబంధమేందిరా.. ప్రపంచంలో దానికొకే బాస.. అదొక్కటొత్తే సాలు.. అన్ని బాసలూ వచ్చినట్టే..

రింగోడు : మహానుభావులు సార్.. నాకర్థంకాక అడుగుతున్నా.. ఆ రంగమ్మ పొలం మీరెందుకు నా పేరుమీద కొన్నట్టూ..

మంత్రి : రింగురోడ్డు పొలం పక్కనుంచో పోతందిరా.. ఈ ఇసయం నీకూ, నాకూ తప్ప ఎవ్వుల్లకీ తెలవదు.. తస్సాదియ్యా.. రోడ్డుపక్క స్థలానికి ఎన్నికోట్ల విలువుంటదో ఆలోసిచ్చు..

రింగోడు : మరి మల్లేశానికి ఉద్యోగమో.. (మంత్రి పెద్దగా నవ్వేశాడు..)

## లైట్స్ ఆఫ్

## 5వ సీన్

(మంత్రి ఇల్లు.. ఖాళీగా వుంటుంది.. మల్లేశం టక్ చేసుకొని వచ్చి నిలబడ్డాడు.. అప్పుడే మంత్రి మల్లెపూలు తన వంటి మీద నుంచి దులుపుకుంటూ బయటికి వచ్చాడు..)

మంత్రి : రేయ్.. రింగూ.. రింగూ...

మల్లే : రింగోడు లేడుసార్.. ఏదో పనిమీద మీరతన్ని బయటికి పంపారంట..

మంత్రి : తస్సాదియ్యా.. నువ్వెవురు..

మల్లే : మల్లేశం.. నాకు మీతో ఉద్యోగమిప్పిస్తానని మీ పిఏ రింగోడు మా ఇల్లు, పొలాలు తనఖాపేరుతో తీసుకున్నాడు. కానీ వాటిని మీకు అమ్మేసినట్లుగా తెలిసింది.

మంత్రి : నీపేరు..

మల్లే : మల్లేశం..

మంత్రి : చూడు మల్లేశం.. ఆ పొలాలు నేను కొనేశాను. ఇక నీ ఉద్యోగం గురించైతే రింగోడు నాతో మాట్లాడాడు. ఇప్పుడు ఖాళీలేవు.. తర్వాత కనిపించు..

మల్లే : అదే ఎప్పుడు సార్..

మంత్రి : తర్వాతెప్పుడైనా..?

మల్లే : అదే ఆ తర్వాతే ఎప్పుడు సార్..?

మంత్రి : తస్సాదియ్యా.. ఏంటి గొంతు పెంచుతున్నావ్..?

మల్లే : పెంచకేం చెయ్యమంటారు సార్.. పొలాలు, ఇల్లు కాజెయ్యటానికి మాలాంటి పేదోళ్ళే దొరికారా మీకు.. ఏం పెద్ద పెద్ద వాళ్ళ జోలికి పొయ్యే దమ్ము ధైర్యంలేదు మీకు..

మంత్రి : తస్సాదియ్యా.. దమ్ము, ధైర్యం గురించి రొమ్మిరుచుకొని మాట్టాడుతున్నావ్.. నువ్వు మాట్టాడుతోంది మంత్రితో అని తెలుస్తోందా..?

మల్లే : తెలుసురా.. తెలుసు... రైతుల పేర్లు చెప్పి రాజకీయాలు చేసి నాయకుడైనోడితో అని నాకు తెలుసు.. కానీ నీలాంటోడికి ఓట్లేసిన రైతులకేం మిగులుతుందో తెలుసా..? వ్యవసాయం కోసం చేసిన అప్పులు తీర్చలేక, సిరులు పండించిన ఆ నేలను కోల్పోతున్నందుకు బాధతో ఆత్మహత్యలే మిగులుతున్నాయ్..

మంత్రి : తస్సాదియ్యా.. ఒక్కరైతు ఛస్తే దేశానికేం నష్టంలేదు..

మల్లే : నోర్ముయ్.. రైతులేకపోతే మెతుకులేదు, అదిలేక పోతే మానవాళికి బతుకేలేదు. ఒక్కరైతంట.. ఒక్కరైతు.. నీలాంటి రాజకీయనాయకుడు లేకపోయినా ప్రపంచానికొచ్చిన నష్టంలేదు.. అదే రైతులేకపోతే ప్రపంచాన్ని ఒక్కసారి ఊహించు..

మంత్రి : తస్సాదియ్యా.. నాకే నీతులు చెప్తావా.. గెట్టు అవుటూ..

మల్లే : అలానే గెటవుట్ అవుతా.. కానీ రేయ్ మంత్రీ.. సూరీడు రాకముందే పొలం చేరి.. నాగలి భుజానపెట్టి.. తొలకరి వానలో తడిసి. హలాల చదునుగా దున్ని.. మొలకలు నాటు వేసి చుక్కల్ని చూసి గూటికి చేరి, మట్టిని గెలిచి ముత్యపు గింజలు పండించే రైతన్నల ప్రాణమైన భూమిని లాక్కున్నావు కదూ... గుర్తు పెట్టుకో.. అన్యాయంగా నువ్వు కాజేసిన పేదోళ్ళ భూములకీ, వాళ్ళ బతుకులకీ లెక్కచెప్పే రోజొకటొస్తుందని గుర్తుపెట్టుకో.. కంత్రీ మంత్రి..

మంత్రి : తస్సాదియ్యా.. నాకారోజొచ్చిద్దో లేదో కానీ నీకు ఉద్యోగం రాదు.. రేయ్.. ఎవడ్రా అక్కడ.. వీడ్ని ఈడ్చిపారెయ్యండి..

1వ వ్యక్తి : రేయ్.. నడు బయటికి..

2వ వ్యక్తి : నడవ్రా.. నడు..

మల్లే : రేయ్ మంత్రీ.. రైతుల్ని ఏడిపిచ్చిన ఏ పాలకుడూ బాగుపడ్డట్టు చరిత్రలోలేదురా.. నీ చరిత్రకు చదలుపట్టే రోజొకటొస్తుంది.. నిన్ను నిలదీసేవాడొకడొస్తాడు.. నిలువునా నిన్ను ఉప్పుపాతరేస్తాడు...

(మంత్రి అనుచరులు బయటికి లాక్కెళ్ళిపోతారు...)

మంత్రి : తస్సాదియ్యా... బబితా డాలింగుతో సేసిన రొమాన్సు మూడంతా సెడకొట్టేశాడు యదవని.. యదవ.. అందుకే నాకీపేదోళ్ళంటే పరమకంపు.. రేయ్.. ఈడ కొత్తగా వచ్చిన డెటాలుతో శుభ్రం సెయ్యండి.. మూడు మారాల... బబితా డాలింగో.... (అంటూ వెళ్ళిపోతుండగా...)

లైట్స్ఆఫ్

## 6వ సీన్

(ముందు కర్చీలు, టీపాయ్.. దానిమీద మద్యం గ్లాసులు, మద్యం సీసా వున్నాయి.. మంత్రి చేతిలో మద్యం బాటిల్ పట్టుకొని..)

మంత్రి : మద్యపానం ఆరోగ్యానికి హానికరం.. లిక్కర్ డ్రింకింగ్ ఈజ్ ఇంజ్యూరియస్ టు హెల్త్.. తస్సదియ్య బాటిల్ చూస్తే కన్నెపిల్ల కన్నుకొట్టి రా.. రా.. సరసకు రారా అని పిలుస్తున్నట్లుంటే.. దీన్నెవడు పట్టించుకుంటారు.. నాన్సెన్స్.. (ఫోన్ తీశాడు..) హలో.. బబితా డాలింగ్.. సిఎం కూడా నా అపాయింట్మెంట్ కోసం వెయిట్ చేస్తాడు. అలాంటిది నీ అపాయింట్మెంట్ కోసం నన్ను వెయిట్ చేయిస్తున్నావ్ కదే.. ఆన్ ద వేనా.. అచ్చా.. అచ్చా.. అచ్చా.. వుంటా.. దీనెమ్మ.. దీనికి నా భాషరాదు.. నాకు దీనిభాష రాదూ..

రంగ : మంత్రిగోర్ని కలవాల నన్ను లోనికి పోనీండి సామీ..

తెరలో : ఎల్లెల్లవమ్మో.. చెప్పేది నీక్కాదూ.. మంత్రిగారు చానా ఇంపార్టెంట్ పనిలో వున్నారు.

రంగ : సామీ.. నాలుగు వారాలుగా వత్తనే వున్నా..మీరిట్టనే సెప్తున్నారు. నేనట్టనే ఎల్లిపోతన్నా.. ఈయేల ఎట్టాగైనా మంత్రిగోర్ని కలవాల్సిందే సామీ.. నన్ను పోనీండయ్యా..

మంత్రి : రేయ్.. ఎవర్రా వచ్చింది? ( ఈడైలాగ్ మీద జనరల్ లైట్స్ ఆన్ అయ్యాయి. వేటాడు తున్న పులి బొమ్మ కర్టెన్ మీద తగిలించి వుంటుంది. అది మంత్రిగారిల్లు)

రంగ : (ప్రవేశించింది) దండాలు సామీ..

మంత్రి : సినిమా హీరోయిన్ బబితాపటేల్ గ్లామర్ కోసం వెయిట్ చేస్తుంటే.. పొద్దున్నే దరిద్రపు మొహంతో నీ ఎంట్రీ ఒకటి.. చెప్పు ఎందుకొచ్చావ్..

రంగ : అదేంది సామీ.. నా కొడుక్కి ఉద్దోగమేపిత్తానంటిరీ..

మంత్రి : ముష్టిముండా.. ఉద్దోగాలేమన్నా చెట్లకి కాస్తున్నాయంటే.. అడగ్గానే కోసియ్యటానికీ..

రంగ : అందేంది సామీ... తాతలనాటి మా పొలం మీ మడుసులచేత కాజేత్తిరి.. లచ్చరూపాయలు తెచ్చి మీకిత్తిని.. దుడ్డు తీసుకొని నా కొడుక్కి ఉద్దోగమేపిత్తానంటిరి గదసామీ...

మంత్రి : నన్నే లంచగొండి అంటావంటే లంబ్డీకానా..? (అని కాలితో కడుపులో తన్నాడు. అంతదూరం పడింది)

రంగ : అవును సామీ.. అవును.. నేను లంబ్డీకాన్నే.. లేకపోతే మట్టిపిసుక్కుంటా.. పొలందున్నుకుంటా.. నలుగురి ఆకలి తీర్చే రైతు అనే గొప్ప ఉద్దోగాన్ని వదులుకొని, గమర్నమెంటు ఉద్దోగం ఇప్పిత్తారని, అన్నంపెట్టే పొలాన్ని అమ్ముకుని లచ్చతెచ్చి మీ వజాన పోశాను సూడూ నేను లంబ్డీకాన్నే సామీ.. ఓట్లకోసం మా అసొంటోల్ల కాల్లట్టుకొని, గడ్డాలట్టుకొని అడుక్కుంటారే మరి మీరేమౌతారు సామీ..

మంత్రి : సేయ్.. మురికి ముండా.. నన్నే అనేంత బలిసిందే నీకు.. ఉద్దోగంలేదు.. గిద్దోగంలేదు.. నీ దిక్కున్నచోట చెప్పుకోపో...

రంగ : పొలమెట్టాగూ మింగేత్తిరి.. నేనిచ్చిన లచ్చదుడ్డన్నా ఇయ్యిసామీ.. నా కొడుకుతో ఏదైనా యాపారమన్నా పెట్టిచ్చుకుంటా.. సామీ...

మంత్రి : లచ్చా.. ఎవుడికిచ్చినావే..? లంజకానా..? నాచ్చినావంటే? నాకిచ్చినావంటే? నాకిచ్చినట్టు సాక్ష్యముందా? వుంటే తీసుకురా పోవే...

రంగ : అయ్యో.. సామీ.. అంతమాటనబోక.. సచ్చి నీకడుపున పుడతా.. మీరిమ్మన్నోల్లకే ఇచ్చినాను గదసామీ..

మంత్రి : నేనెక్కడిమ్మన్నానే.. అసలు నువ్వెవతివో కూడా నాకు తెలీదు.. వెళ్ళు.. వెళ్ళిక్కడనుంచి.. అడ్డమైన పందులూ ఈడపడి దొర్లటానికి ఇదేం పందుల దొడ్డి కాదే.. మాలాంటి పెద్ద మనుషులు తిరిగే అడ్డా.. వెళ్ళు..

రంగ : ఎల్తాను సామీ.. ఎల్తాను. కులపోడు.. కులపోడు అని నమ్మి ఓట్లేసినందుకు బాగా బుద్ధి సెప్పావయ్యా.. బాగా బుద్ధి సెప్పావు.. సామీ.. మాలాంటి పేదోల్ల కడుపుకొట్టి కడుపులు నింపుకునే ఒరేయ్.. పెద్దోడా.. ఏ నాటికైనా మా ఉసురు కొట్టుకొని పురుగులబట్టి పోతావు.. నాశనమైపోతావురా.. మట్టికొట్టుకుపోతావ్..

మంత్రి : శాపనార్థాలు పెడతావే..నీ యమ్మని దెం... ( జుట్టు పట్టుకొని చేత్తో కడుపులో కొట్టాడు.. కిందపడేసి కాలితో తన్నాడు. ఆమె మొహంమీద కాలుపెట్టి...)

భూగోళం పుట్టుక కోసం కూలిన సురగోళాలెన్నో..

ఈ మానవ రూపం కోసం జరిగిన పరిణామాలెన్నో...

(రంగమ్మ దొర్లుకుంటూ ఒక పక్కకెళ్ళింది. అక్కడ నుండి రంగమ్మ మెల్లిగా లేచింది. దెబ్బలికి ఏడుస్తూ.. కడుపు పట్టుకొని బాధని అనుభవిస్తుంటే.. ఆమె మొహంమీద కాలుపెట్టాడు..) ఇంకోసారి దుడ్డు గిడ్డూ అంటూ వస్తే ప్రాణం తస్తా.. ఖబడ్దార్..

ఒక రాజుని గెలిపించుటలో ఒరిగిన నరకంఠాలెన్నో...

(అంటూ తన్నాడు.. దొర్లుకుంటూ వెళ్ళింది..)

ధనవంతుల దుర్మార్గాలకు.. దగ్ధమైన బ్రతుకులు ఎన్నో..

(రంగమ్మ మెల్లిగా లేచింది..)

ఆ చల్లని సముద్ర గర్భం దాచిన బడబానలమెంతో...

(వెళ్ళిపోయింది.. మంత్రి సెంటర్ లోకి వచ్చాడు.. అతని మీద స్పాట్ ఆన్ అయింది...)

మంత్రి : ( ఫోన్ తీశాడు.. ) హలో.. బబితా.. నీకోసం వెయిట్ చేస్తున్నా.. ఇంకా రాలేదేంటి? ఆన్ ద వేనా.. (కాల్ కట్ అయినట్లు చిన్న జర్క్) ఇందాకట్నించి అదే మాట.. ఎక్కడి దాకా వచ్చిందో చెప్పదు.. (ఫోన్ మోగింది) హలో.. బబితా.. నువ్వా.. చెప్పు.. టెన్త్, ఇంటర్ ఎగ్జామ్స్ పేపరా.. ఇంకా ప్రిపేర్ అవ్వలేదు.. అప్పుడే అవుట్ చెయ్యమంటే ఎలా.? కాస్తన్నా బుద్ధుండాలయ్యా.. ఎంత రెసిడెన్షియల్ అయితే మాత్రం అంత ఆదుర్దానా? అలాగే.. అలాగే.. పంపుతాను.. సర్కారు వారి పాట పేపరుకి రెండు పెట్టెలు.. పెట్టెంటే తెలీనోడివి నీకెందుకయ్యా పేపరు లీకేజీలు.. పెట్టె అంటే పదిలక్షలు. ఎక్కువా..? అయినా ఈ 1990లో పదిలక్షలకేమొస్తుందయ్యా.. అంత ఎక్కువనిపిస్తే నోరుమూసుకొని ఫోన్ పెట్టెయ్యవయ్యా.. మీరేమో వేలకి వేలు డొనేషన్లనీ, కల్చరల్ అనీ, స్పోర్ట్స్ మీట్ అనీ అడ్డమైన పేర్లు చెప్పి పేరెంట్స్ నుండి అప్పనంగా డబ్బులు కాజేస్తారు. మాదాకా వచ్చేసరికి ఏడుస్తారు.. తగ్గేదే లేదయ్యా.. నీ ఇష్టం. ఇష్టమేనా.. సరే.. మా పిఏ ని కలువు. ముందో పెట్టె ఇచ్చి వేలంపాటలో పాల్గొను. ఆరోజుకి రేటెంతుంటుందో.. అవునయ్యా.. వేలంపాటలో పాల్గొనాలంటే ఎంట్రీ ఫీజు ఒక పెట్టె.. వుంటాను. ( ఫోన్ పెట్టేసి మరో ఫోన్ చేశాడు..) హలో..పి.ఎ.. వాడు ఆ క్రాంతి కాలేజీ ప్రిన్సిపాల్ నిన్ను కలుస్తాడు. మన రేటు తెలుసుగా.. ఎంట్రీ ఫీజు ఒక పెట్టె.. వుంటాను. (వికటంగా నవ్వుతూంటాడు... అతనిమీద స్పాట్ ఆగిపోయింది.. రంగమ్మ, శ్రీనివాసరావుల మీద స్పాట్ వెలిగింది.)

(ఫ్లాష్ బ్యాక్ క్లోజ్)

రంగ : సామీ.. మంత్రి మా కులపోడు.. మాక్కాక ఎవురికి ఉద్దోగమొత్తదని ఇర్రీగాను బాబో.. ఆడ నాకు జరిగిన అవమానం బయటనుండి సూసిన నా కొడుకు ఆవేశంగా అట్నుంచటే ఎటో ఎల్లిపోనాడు. నానెవురికోసం బతకాల బాబో.. ఎవురికోసం బతకాలె.. నాకు.. నాను.. (ఆమెకి ఏడుపుతో మాట రాలేదు. అంతా బొమ్మలా కూర్చొని వింటున్న శ్రీనివాసరావు ఆమెని ఎలా ఓదార్చాలో అర్ధంకాలేదు. అయ్యో అని వినిపించీ వినపించట్లుగా గొణిగాడు. రంగమ్మ కన్నీళ్ళు తుడుచుకొని) ఆ మంత్రిగాడు మా కులపోడే.. కానీ మా సెడ్డ అన్నేయాలు సేత్తన్నాడు బాబో.. తమసొంటోల్లు గాంధీ తాతలా మా అసొంటోల్లని ఆదుకోవాల బాబో.. ఆదుకోవాల.. (రెండు చేతులెత్తి దండం పెట్టింది. జనరల్ లైట్స్ ఆన్ అయ్యాయి. శ్రీనివాసరావుకి ఏం మాట్లాడాలో అర్ధంకాలేదు. పడుకోమన్నట్లుగా సైగ చేసి అక్కడి

నుండి లోపలికెళ్ళి తలుపేసుకున్నాడు. రంగమ్మ కూడా పడుకుంది. లోపలా బయటా కూడా లైట్లు డిమ్ అయ్యాయి. కాసేపటికి అక్కడికి ఒక యువకుడు వచ్చాడు. దుప్పటి కప్పుకొని పడుకున్న రంగమ్మని చూశాడు. రంగమ్మ తలని నిమిరాడు.)

మల్లే : అమ్మా.. ఆ మంత్రిగాడు మనకి చేసిన ద్రోహానికి ముక్కలు ముక్కలుగా నరికిపారెయ్యాలనుంది. ఏం చేస్తాం.. ఆడి దగ్గరవున్న బలగం మన దగ్గరలేదు. ఆడికున్న అదికారం మనకిలేదు. ఆలోచించా అమ్మా.. బాగా ఆలోచించా.. ఆడివల్ల మనమే కాదు.. చానామంది మనలాంటోళ్ళు అన్యాయమైపోయారు. అలాంటోణ్ణి ఎదుర్కోటానికి మన ఒక్కళ్ళ బలం చాలదమ్మా.. మనలాంటి ఎంతోమంది బలం కావాలి. అధికారంతో తలెగరేస్తున్న ఆ ఆంబోతు మెడలు వంచే చైతన్యం కావాలి. ఆ చైతన్యాన్ని వెతుక్కుంటూ వెళుతున్నా.. నన్ను ఆశీర్వదించు.. (అంటూ కాళ్ళు పట్టుకున్నాడు. రంగమ్మలో చలనం వచ్చింది. లేచి కూర్చుంది.)

రంగ : రేయ్.. మల్లేశమా.. నువ్వెటుపోనావా అని అంతా దేవులాడానయ్యా... ఏడా కనిపియ్యకపోయేసరికి.. నీకోసం రేపు దేవులాడదామనుకుంటి. ఇట్టా ఈడకొచ్చి పడుకుంటినయ్యా...

మల్లే : నువ్వింకా నిద్రపోలేదా..

రంగ : నిద్రరాటంలేదురా.. ఆ మంత్రి కొట్టిన దెబ్బలు నెప్పెడుతుండాయిరా.. ముసలిదానన్ని కూడా సూడకుండా ఇట్టమొచ్చినట్టు కొట్టాడు. ఒరేయ్ మల్లేశా.. పేగులు సితికినట్టుండాయిరా.. కడుపులో ఒకటే నొప్పెడుతోంది.. భరించలేక పోతున్నా్నా.. (నరకయాతన పడుతోంది)

మల్లే : లేమ్మా.. ఆసుపత్రికి పోదాం..

రంగ : వద్దురా...

మల్లే : ఏం.. నిన్నిట్టా ఎట్టా వదిలేస్తా.. ఎల్దాం పదమ్మా..

రంగ : ఒరేయ్.. మల్లేశమా.. నాకు తెలుత్తాంది.. ఆఖరి ఘడియలు వచ్చేశాయయ్యా..

మల్లే : నువ్వట్లా మాట్లాడకమ్మా .. నీకు దండంపెడతా.. నిన్ను నేను కాపాడుకుంటాను.. మనూరెల్లిపోదాం.. పదమ్మా..

రంగ : పిచ్చిసన్నాసీ.. నన్ను నువ్వేడ కాపాడతావురా..? అయినా మనూల్లో ఏముందిరా.. నన్ను తీసుకుపోటానికీ.. అంగులం నేలకూడా మనదికాదు.. ఆ మంత్రి తన మడుసులతో వున్న భూమిని కాజేసె.. నీకా ఉద్యోగం రాకపోయే. నువ్వెట్టా బతుకుతావా అని దిగులుగా వుందిరా..

మల్లే : అమ్మా.. నాకు ఉద్యోగం రాకపోతే ఏంటమ్మా..? ఎట్టాగొట్టా నిన్ను నేను పోషించుకుంటా.. మనం.. మనం.. (ఎర్రజెండా పిలుస్తోంది.) అడవికెల్లిపోదాం.. అడవికెల్లిపోదాం..

రంగ : అడవికా.. ఆడెవ్వరున్నారా..

మల్లే : ఆడే వున్నారమ్మా.. అంతా ఆడే వున్నారు.. ఎవ్వరికీ ఎవ్వరూ కాని, అందరికీ తామే అని ముందుకొచ్చే అన్నలున్నారు, అక్కలున్నారమ్మా.. అధికార మదంతో మదించి మందిని తమ కర్కశపు గిట్టలతో తొక్కేసే ఈ ఆంబోతుల్లాంటి ఈ మంత్రిని, అలాంటి వైట్ కాలర్ పెత్తందార్ల గుత్తాధిపత్యానికి ముక్కుతాడు వేసి అదిలించే చైతన్యం అక్కడే వుంది... అక్కడికే వెల్దాం.. అక్కడి నుండి మనం అనుకున్నది సాధిద్దాం..

పదమ్మా వెల్దాం.. (అడుగు తీసి కాలు పెట్టింది. ఒక అడుగు వేసింది.. కదల్లేక కింద పడిపోయింది. కడుపు పట్టుకొని కిందపడి దొర్లుతోంది..)

రంగ : అరేయ్ మల్లేశా.. నేనీడ నుండి అడుగు కూడా ముందుకు కదల్లేనయ్యా.. నా శవాన్ని ఈడ్నే వదిలేసెల్లిపో.. అనాధశవం చేశానని నువ్వు బాధపడకు. నా శవాన్ని నువ్వు తీసుకెల్లినా ఏమీ సెయ్యలేవురా.. ఈడ వదిలేత్తే కనీసం మునిసిపాలిటీ వాల్లన్నా సెత్తతో తగలేత్తారయ్యా..

మల్లే : వద్దమ్మా.. అట్టా మాట్టాడద్దమ్మా.. (అంటూ తల్లిని ఎత్తే ప్రయత్నం చేస్తాడు.)

రంగ : ఎల్లరా.. ఏడికైనా పో.. ఉద్దోగం సేసుకో.. ఎల్లూ..(అంటూ చచ్చిపోయింది.)

మల్లే : వెళుతున్నా అమ్మా.. ఉద్యోగం కోసం కాదు.. ఉద్యమం కోసం వెల్తున్నా ..పీడిత పాలకుల మదమణచటానికి, మదించిన ఆ ఏనుగుల కుంభస్థలాన్ని పగలకొట్టటానికీ, ఇన్నాళ్ళూ పట్టుకున్న ఈ పెన్నుని పక్కనపెట్టి గన్నుని పట్టుకోటానికి వెళుతున్నా అమ్మా.. గన్ కెన్ డూ ఎవ్రిథింగ్. తుపాకులు తలచుకుంటే ఏమైనా సాధిస్తాయి. జోహార్ రంగమ్మ.. అమర్ రహే రంగమ్మ. జోహార్ కామ్రేడ్ రంగమ్మ. జోహార్.. (అతను అక్కడి నుండి బయల్దేరాడు..ఫీల్.. ఆలాపన..మల్లేశం అక్కడ నుండి వెళ్ళిపోయాడు.. మెల్లెగా తెల్లారింది. దగ్గర లోని గుడిలోంచి స్వామి వారి సుప్రభాతం వినిపిస్తోంది. శ్రీనివాసరావు లేచి తలుపు తీసుకొని బయటికొచ్చాడు. అక్కడే వున్న రంగమ్మని చూసి నవ్వుకొని బజారుకెళ్ళాడు. పాలపేకట్లు తెచ్చాడు. రంగమ్మని నిద్రలేపుతూ..)

శ్రీని : రంగమ్మ.. రంగమ్మ.. నిద్రలే.. తెల్లారింది. మీ వూరు వెళ్ళే బస్సు బయల్దేరే వేళైంది. వేప పుల్లతో పళ్ళు తోముకో.. కాఫీ పెట్టిస్తా.. తాగి బయల్దేరుదువులే.. (ఇంట్లోకెళ్ళాడు. వంటింట్లోకి వెళ్ళి కాఫీ తీసుకొచ్చాడు. రంగమ్మలో ఏ చలనమూ లేకపోవటంతో ఆశ్చర్యపోతూ.. ఆమెని తట్టిలేపాడు. రంగమ్మ శరీరం చల్లగా తగిలింది. చేతిలో గ్లాసు కిందపడేశాడు. అక్కడే కూలబడ్డాడు. పక్కనే అప్పటిదాకా నక్కి వున్న మల్లేశం పరుగులాంటి నడకతో అక్కడికి వచ్చాడు.)

మల్లే : ఏమైంది సార్...

శ్రీని : ఈమె రాత్రి బస్సు ఆలస్యమైందని ఇక్కడ పడుకుంటానంటే పడుకోమన్నాను. తెల్లారి లేచేసరికి చనిపోయింది. ఏం చెయ్యాలో అర్థంకావట్లేదు. ఆ పోలీసులకి ఫోన్ చేసి చెప్తాను.. (అంటూ ఇంట్లోకి కదల బోతుంటే..)

మల్లే : (దగ్గరకొచ్చి ఆమెని చూస్తూ...) బాబుగారూ.. ఈమెది మా ఊరేనండీ.. పేరు రంగమ్మండీ..

శ్రీని : (శ్రీనివాసరావు వెనక్కి వస్తూ...) అవును.. నాకూ అదే చెప్పింది. ఈమెకో కొడుక్కూడా వున్నాడనీ.. పేరు మల్లయ్యో.. మల్లన్నో.. ఏదో చెప్పినట్లు గుర్తు..

మల్లే : అవునయ్యా.. మల్లేశం.. అందరూ వాడ్ని మల్లన్న అనీ మల్లేశనీ పిలుస్తారు.

శ్రీని : అతనికి కబురు చెయ్యవయ్యా.. వచ్చి ..పాపం వాళ్ళమ్మ శవాన్ని తీసుకెల్తాడు..

మల్లే : ఆడూ.. ఆడూ.. రాత్రే సచ్చిపోనాడయ్యా.. ఈ చేతులతోనే ఆడ్ని పూడ్చిపెట్టి వత్తన్నానయ్యా..

శ్రీని : అయ్యో.. మరిప్పుడెట్లా.. ఈమె పరిస్థితేంటి?

మల్లే : అయ్యా.. తమరేం అనుకోనంటే అమ్మలాంటిదయ్యా.. దహన సంస్కారాలు సెయ్యటానికి ఏదైనా సాయం సేత్తే.. ఆ పనేదో నేనే సేత్తానయ్యా.. నేనే సేత్తాను.. (అంటూ శ్రీనివాసరావు కాళ్ళమీద పడ్డాడు.)

శ్రీని : ఒక్కనిమిషం (లోపలికెళ్ళాడు. డబ్బు తీసుకొచ్చాడు.) నాదగ్గర ఇప్పటికిదే వుంది. సరిపోతుందనకుంటాను.

మల్లే : (చేతులెత్తి దండం పెడుతూ..) మీమేలు ఈ జన్మలో మర్చిపోలేనయ్యా.. అనాధ శవంలా మునిసిపాలిటీ చెత్తలో తగలబడకుండా.. మా అమ్మకి.. మా పెద్దమ్మకి దహన సంస్కారం చేపిత్తన్నారంటే మీరు దేవుళ్ళయ్యా.. దేవుళ్ళు... (అంటూ శవాన్ని ఎత్తబోతుండగా...ఆలాపన...)

## లైట్స్ ఆఫ్

## 7వ సీన్

(శ్రీనివాసరావు ఆలోచిస్తున్నాడు. అతనికి రంగమ్మ అన్నమాటలు వినిపిసతున్నాయి. అతని చెవుల్లో మారు మోగుతున్నాయి.)

రంగ : బాబో.. ఆ మంత్రిగాడు మా కులపోడే.. కానీ మా సెడ్డ అన్నేయాలు సేత్తన్నాడు బాబో.. తమసొంటోల్లు గాంధీ తాతలా మా అసొంటోల్లని ఆదుకోవాల బాబో.. ఆదుకోవాల.. (శ్రీనివాసరావు తనలో తనే మదన పడుతున్నాడు. ఒకచోట కూర్చోలేక పోతున్నాడు.)

శ్రీని : చేస్తాను రంగమ్మా.. నీకోసం నేను ఏది వీలైతే అదే చేస్తాను. అసలీ మంతరిని ఎదిరించటం అంత మామూలు విషయం కాదు. హిస్టరీ మాస్టారిగా పాఠం చెప్పగలనేమో కానీ నలుగురితో కలిసి మాట్లాడటం కూడా నాకు సరిగారాదు. మరి నేనేం చెయ్యగలను. ఆ మంత్రి చిన్నప్పటి నుంచీ ఊర్లో అందరికీ బాగా తెలుసు. స్కూల్లో వాడికీ నేను పాఠాలు చెప్పాను. నాకు తెలిసి వాడొక అనాధ.. మరి వాడికి కులం ఎక్కడ నుంచి వచ్చింది. ఆ గుర్తొచ్చింది.. కాంపౌండర్ పాడు వల్ల వీడు చదువుకున్నాడు. వాడి వల్లే వీడు రాజకీయాల్లోకి వచ్చాడు. నేనెప్పుడైనా ... ఎక్కడైనా కనిపిస్తే నమస్కారం మాష్టారూ అంటం తప్ప పెద్దగా వాడికీ నాకూ పరిచయం లేదు. వీడి రాజకీయ జీవితం నాకు పెద్దగా తెలీదు.. ఏం చెయ్యాలి.. రంగమ్మకి నేనెలా న్యాయం చెయ్యాలి? అయినా ఆమేంటి నన్ను గాంధీతో పోలుస్తోంది. చంపారణ్ లో నీలిమందు పంటవేసిన రైతులు గాంధీని రక్షించమని కోరినట్లుంది రంగమ్మ నన్ను కోరటం.

రంగ : సార్..

శ్రీని : నువ్వు చచ్చిపోయావు కదా.. మళ్ళీ ఎలా వచ్చావ్..

రంగ : నేను చచ్చిపోయింది నిజం. మీ ఆలోచనల్లో ఇంకా బతికే వుండటం నిజం..

శ్రీని : అర్ధమైంది.. నువ్వు నా ఇల్యూషన్ అన్నమాట..

రంగ : కరెక్టండీ..

శ్రీని : నువ్వు నీ ఇంగ్లీషు సమాధానం చూస్తుంటే నాకు అర్ధమైంది.. నువ్వు నా ఇల్యూషనే అని.. అంటే నా మైండ్ వాయిస్.. అయినా సరే కనిపిస్తున్నావ్ కాబట్టి కాసేపు నీతో మాట్లాడుతూ నేనూ ఓ క్లారిటీకొస్తా.. నీకోసం ఏదో ఒకటి చెయ్యాలి..

రంగ : ఏం చేసినా మంత్రికి తెలీకుండా చెయ్యాలి.

శ్రీని : ఓపని చేద్దాం రంగమ్మా.. ఈ మంత్రి గురించి ముఖ్యమంత్రికి చెప్తేనో..

రంగ : మీరు భలేవాళ్ళండీ.. ఆయనంటే ముఖ్యమంత్రికీ భయమేనండీ.. ఈ మంత్రి తనబోటోళ్ళందరికీ పదవులు కట్టబెట్టి జిల్లానే తన గుప్పిట్లో పెట్టక్కూకున్నాడండీ.. నీలాంటోడు అతని దగ్గరక్కూడా వెళ్ళలేరు.

శ్రీని : మరి ఇంత తెలిసి నన్నెందుకమ్మా గాంధీ మహాత్ముడితో పోల్చటం.. ఇలా రెచ్చగొట్టటం..

రంగ : ఓ పని చెయ్యండి .. మీకు తెలిసినోళ్ళనడిగి ఆ మంత్రి గురించి వాళ్ళకేం తెలుసో కనుక్కోండి.. అవన్నీ ఒక బుక్ లో నోట్ చేసుకోండి.. తర్వాతేం చెయ్యాలో అప్పుడు ఆలోచిద్దాం..

శ్రీని : ఈ సలహా కూడా బానే వుంది. (( సాకీ)ఫోన్ తీసుకొని తనకి తెలిసిన అందరికీ చేస్తున్నాడు. అదంతా ఒక విధమైన ఫాస్ట్ ఫార్వర్డ్ టైప్ లో వుండాలి. ఇద్దరి మూమెంట్లు కూడా అలాగే వుండాలి.. శ్రీనివాసరావు అన్నీ రాసుకుంటున్నాడు..) ఒక పని అయిపోయింది రంగమ్మా..

రంగ : ఏమైపోయిందీ.. అసలు కథ ఇంకా వుంది. ఈ మంత్రి వల్ల ఎవరెవరు మోసపోయారు? ఎలా డబ్బులు చేసుకున్నారు..? కాంట్రాక్టులు తెప్పించుకున్నారు? బదిలీలు చేయించుకున్నారు? ఉద్యోగాలు సంపాదించుకున్నారు? పోలీసు కేసుల్లోంచి ఎలా బయట పడ్డారు? బ్యాంకులోన్లు ఎలా మంజూరు చేయించుకున్నారు? ఎలా ఐపీలు పెట్టారు? ఇళ్ళ స్థలాలు ఎలా చేజిక్కించుకున్నారు? ఇవన్నీ వాళ్ళు విన్నవీ, వాళ్ళు ఎదుర్కొన్నవీ చెప్పారు. అవన్నీ నువ్వు రాసుకున్నావ్ అవునా?

శ్రీని : అవునమ్మా.. అదే రాశాను..

రంగ : ఆయన గురించి నువ్వు తెలిసుకుంది గోరంతే.. తెలుసుకోవాలసింది కొండంత..

శ్రీని : ఇంకేం చెయ్యాలి?

రంగ : ఆలోచించాలి.. ఆ మాస్టారూ.. అతను అరాకొరగా చేస్తున్న మంచిపనులు అతని అన్యాయాల చీకటి కొండలమీద అక్కడక్కడా చిరుదీపాల్లా మెరుస్తున్నాయి. పైపైన చూసేవాళ్ళకి ఇతను చేస్తుందంతా ప్రజాసేవలాగే వుంటుంది. మధ్యతరగతి వాళ్ళ అవసరాలు తీరుస్తానంటూ వీలైనంత రాబట్టుకుంటాడు. బాగా డబ్బున్న వాళ్ళతో పూర్తిగా వ్యాపారపరంగా వాటా వ్యవహారం నడుపుతాడు. బాగా నష్టపోయే వాళ్ళంతా చిన్నా చితకా వాళ్లే.. చిన్న చిన్న చలిచీమలు కూడబలుక్కొని పెద్ద పాముల పని పడతాయని మీరు చదువుకోలేదు..

శ్రీని : ఎందుకు చదువుకోలేదు.. బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చావదె సుమతీ అని..

రంగ : ఊ..ఊ.. ఈ రోజుల్లో అలా జరగటంలేదు. ఎందుకంటే ఇప్పటి ఈ చలిచీమలకు ఐక్యతలేదు మాష్టారూ.. అడవిలో పులి తన ఆహారమైన లేడికోసం పరిగెత్తాలి. లేడి తన తిండి తను తింటూ, పులికి అందనంత వేగంగా పరిగెత్తాలి. లేడికంటే వేగంగా పరిగెత్తకపోతే పులి ఆహారం దొరక్క చస్తుంది. పులికి అందనంత వేగంగా పరిగెత్తకపోతే లేడి పులికి ఆహారంగా మారుతుంది. ఇది అన్ని జంతువులకీ వర్తిస్తుంది. ఇందులో రిజర్వేషన్లు లేవు మాస్టారు. ఎందుకంటే అది అడవి ధర్మం. అయినా సరే అడవిలో పులులూ, లేళ్ళూ బ్యాలెన్స్ గా వుంటాయి. ఎందుకంటే ఆకలి కడుపుకి కావలసిన దానికోసం మాత్రమే జంతువులు వేటాడుతాయి. కానీ మనుషులలా కాదే.. రేపటికి దాచుకోవాలి. కొడుకులకీ, మనవలకీ తరతరాల వాళ్ళకీ దాచి పెట్టాలి. అందుకోసం వీలైనంత , వీలున్న చోటల్లా, వీలైన వాళ్ళందరి దగ్గర, అవకాశాలు సృష్టించి మరీ దోచుకోవాలి. ఈ డబ్బు వేటలో అందరూ అందరికీ ఆహారమే మాస్టారూ.. ఏ ధర్మానికీ కట్టుబడక తన స్వార్థానికి మాత్రమే బ్రతుకుతున్న వాళ్ళకి – ఒక ధర్మానికి కట్టుబడిన వాళ్ళని దోచుకోవటం చాలా ఈజీ..

మనూరి మంత్రి ఈ కోవకు చెందిన వాడు. నోట్ల కోసం, ఓట్లకోసం మాత్రమే బ్రతుకుతున్న పరాన్నజీవి. తన కులస్థులైనా, మరో కులస్థులైనా, తరతమ భేదాలు లేకుండా ఎవరినైనా ఎలాగైనా దోచేసుకోగలడు..

శ్రీని : కానీ సమాజం దృష్టిలో అతను ప్రజాసేవ చేస్తున్నాడే..

రంగ : అవును చేస్తున్నాడు. మన జిల్లాకి మంత్రి వచ్చినప్పుడల్లా ఏదో ఒక ఊరిలో ఎవరో ఒకరు ఆయనకు సన్మానం చేస్తుంటారు. జిల్లా ఎడిషన్ లో మంత్రి ఫోటోలు, బిరుదులు, పొగడ్తలతో వార్తల్లో ఎప్పుడూ కనిపిస్తూ ప్రజల్ని సైకలాజికల్ గా తానొక ప్రజాసేవకుడినని ట్యూన్ చేస్తున్నాడు.

శ్రీని : అంతటి బలవంతుడ్ని ఎదిరించే బలం, బలగం నాకెక్కడివి?

రంగ : మరి మీరు నాకిచ్చిన మాటో..

శ్రీని : ఇచ్చానమ్మా.. ఇచ్చాను.. ఆ మాటకోసమే నా తిప్పలు.. వందల ఏళ్ళక్రిందట భారత దేశాన్ని ఆర్ధికంగా సుసంపన్నం చేసిన ఎందరో రాజుల చరిత్రతోపాటు, దేశాన్ని కొల్లగొట్టిన విదేశీరాజుల గురించి, ఎక్కడి నుండో వచ్చి ఢిల్లీ గద్దెనెక్కి తరతరాలుగా పాలించిన రాజవంశాల గురించి , ఆంగ్లేయుల పాలనలో భారతీయులు ఎదుర్కొన్న దుర్భర పరిస్థితుల గురించి వేల మంది పిల్లలకి పాఠాలుగా చెప్పాను. పిల్లలు కాబట్టి వాళ్ళు విన్నారు. కానీ, ఎదురుగా బ్రతికే వున్న బలమైన వీడి గురించి, వీడి నీచమైన, హీనమైన చరిత్ర గురించి ఈ ప్రజలకి ఎలా చెప్పాలో అర్ధం కావట్లేదు. చెప్పినా ప్రజలు వింటారన్న నమ్మకమూలేదు.

రంగ : వింటారు మాస్టారూ.. ప్రజలు ఏం చెప్పినా వింటారు. కాకపోతే వారికి చెప్పే విధానంలో చెప్పాలి. విద్యార్థులకి ఒకలా ప్రజలకు ఒకలా చెప్పాలి. మాస్టారూ.. విజయం వంద అడుగుల దూరంలో వుంది.. అక్కడి దాకా చేరాలంటే ముందు ఒక అడుగు వెయ్యక తప్పదు. తర్వాత అడుగులన్నీ వాటంతట అవే పడతాయి.

తెరలో : పాత పేపర్లు కొంటాం.. న్యూసు పేపర్లు కొంటాం...

రంగ : ఐడియా..?

శ్రీని : ఏంటో..?

రంగ : పాత పేపర్లండీ..

శ్రీని : మనింట్లో లేవుగా...

రంగ : అబ్బా మాస్టారూ... పాతపేపర్లు తీసుకొని మనూరి మంత్రి మంత్రయిన కాడి నుండి ఏఏ పనులు చేశాడు.. ఏఏ వాగ్దానాలు చేశఆడు.. ఇలాంటి వన్నీ కూడా కటింగ్స్ చేసి ముందు ఒక బుక్ లాగా ప్రిపేర్ చెయ్యండి. ఆ తర్వాతేం చెయ్యాలో ఆలోచిద్దాం..

శ్రీని : అబ్బాయ్... పేపర్లబ్బీ.. పేపర్లబ్బీ.. (వసారా లోపలికి వచ్చాడు.)

మల్లే : మీరా బాబో..

శ్రీని : అవును నేనే.. నువవు ఈ పనే చేస్తావా?

మల్లే : అవును సార్.. పగలంతా ఇంటింటికీ తిరిగి పేపర్లు కొంటా.. నైట కాలేజీలో లా చదువుతున్నాను. ఫైనల్ఇయర్..

శ్రీని : వెరీ గుడ్.. డిగ్నిటీ ఆఫ్ లేబర్ అన్నమాట. కిలో న్యూసు పేపర్లు ఎంతేంటి?

మల్లే : ఆరు రూపాయలు

శ్రీని : నీదగ్గర ఎన్ని కిలోలున్నాయ్..

మల్లే : నాదగ్గరెన్ని కిలోలుంటే ఏంసార్.. మీదగ్గరెన్నున్నాయో చెప్పండి.. ఎన్ని కిలోలౌతాయో నేను చెప్తాను.

శ్రీని : నాదగ్గర పేపర్లు లేవయ్యా.. అందుకే నిన్నడుగుతున్నా..

మల్లే : ఏంటిసార్.. పొద్దున్నే నేనే దొరికానా? జోక్ చేస్తున్నారు.

శ్రీని : అది కాదయ్యా.. నీ దగ్గరున్న పేపర్లు నేనే కొందామని అడుగుతున్నా..

మల్లే : నాదగ్గరే పేపర్లు మా సేటు కొంటాడు కదా సార్.

శ్రీని : నాకు పాతపేపర్లు కావాలి. ఎన్ని నెలల కిందటివి వున్నా కొంటాను. అమ్ముతావా?

మల్లే : అమ్మచ్చు కానీ.. సరే సార్.. అమ్మ అంత్యక్రియలకు మీరు నాకు సాయం చేశారు. మీరు పేపర్లు అడుగుతున్నారంటే ఏదో మంచి పనికోసమే అయి వుంటుంది. ఎన్ని కిలోలు కావాలి సార్..

శ్రీని : నీదగ్గరున్న అన్ని పేపర్లు కావాలి..

మల్లే : పొద్దున్నే ఒకామె పదికిలోలేసింది. ఆనిక్కయితే ఓ పాతిక్కిలోలుదాకా అవుతాయి. ఇప్పుడిచ్చేదా.. ఆనిక్కిచ్చేదా..

శ్రీని : ఆనిక్కే తీసుకురా.. నీ పేరు

మల్లే : చైతన్య..

శ్రీని : చాలా బాగుందయ్యా.. చైతన్య.. సమాజంలో చైతన్యం తీసుకొచ్చేందుకు చేపట్టిన ఈ మహత్కార్యానికి శుభప్రదమైన పేరు..

మల్లే : అయతే మీరు చేపట్టిన ప్రజాచైతన్యానికి నా వంతుగా సహకరిస్తా..(సాకీ)

## లైట్స్ ఆఫ్

## 8వ సీన్

(శ్రీనివాసరావు ఒక కుర్చీలో కూర్చున్నాడు. మరో కుర్చీలో రంగమ్మ కూర్చొని వుంది.)

రంగ : పని మొదలెట్టి మూడునెలలు దాటాయి.. ఎలక్షన్లు కూడా దగ్గరకొస్తున్నాయ్.. ఏమేం చేశారో ఒకసారి క్రాస్ చెక్ చేసుకోండి.. ఏది నాకు చెప్పండి..

శ్రీని : రోజూ చెప్పేదేగా.. సరే.. ఇప్పుడూ చెప్తాను.. జాగ్రత్తగా విను. పేపర్లో మనూరి మంత్రి గారి గురించి రాసినవి, ఆయన అన్నమాటలు, చేసిన వాగ్దానాలు అన్నీ ఒక వరసలో ఏర్పాటు చేశాను. దీనికి రెండు వారాలు పట్టింది. వీటిని మనం గమనిస్తే ఏరోజు వార్తలు ఆ రోజే చదవటానికి, వినటానికి బాగుంటాయి.

రంగ : నిజమే టుడే న్యూస్ పేపర్ అఫ్టర్ డే వేస్ట్ పేపర్ అన్నట్లు.. (మంత్రి ప్రవేశం)

మంత్రి : నమస్కారం మాస్టారూ?

శ్రీని : మీరా మంత్రిగారూ.. సెక్యూరిటీ లేకుండా ఒక్కళ్ళే వచ్చారు.

మంత్రి : జనాన్ని దోచేవాడికి సెక్యూరిటీకానీ, నాలాంటి వాడికి, పైగా మీదగ్గరకు వచ్చేప్పుడు కూడా సెక్యూరిటీ ఎందుకు మాస్టారూ...

శ్రీని : అయినా ప్రోటోకాల్ వుంటుందికదా.. సరే.. రండి కూర్చోండి.. (రంగమ్మ వున్న మంచంమీద కూర్చోబోయాడు) అక్కడ వద్దు.. ఈ కుర్చీలో కూర్చోండి.. (పి.ఎ. చెవిలో ఏదో చెప్పాడు..)

మంత్రి : ఏం.. ఎందుకిక్కడ కూర్చోకూడదు మాస్టారూ..

శ్రీని : మంత్రి మంచం ఎక్కితే ఏం బాగుంటుంది. కుర్చీలో కూర్చుంటేనే హుందాగా వుంటుంది.

మంత్రి : హహహ చాలా బాగా చెప్పారు మాస్టారూ..

శ్రీని : ఎలక్షన్లప్పుడు తప్ప విడిరోజుల్లో ఊరకరారు మంత్రిగారు.. విశేషమేంటో..

మంత్రి : వచ్చేలా మీరే చేశారు మాస్టారూ.. తప్పింది కాదు. నా గురించి ఎంక్వైరీలు చేస్తున్నారట.. గవర్నమెంటు ఆఫీసులనుండి నాగురించిన ఇన్ఫర్మేషన్లు తెప్పించుకుంటున్నారట. ఏంటి విషయం..?

శ్రీని : మీరు నాదగ్గర చదువుకున్నారు.

మంత్రి : అవును. ఆ కృతజ్ఞతతోనే .. మంత్రినై వుండి స్వయంగా నేనే మీఇంటికి వచ్చాను.

శ్రీని : నా దగ్గర చదువుకున్న పిల్లల్లో అతి తక్కువ మంది ఉన్నత స్థానాలకు వెళ్ళారు. అయితే వారందరికన్నా ఉన్నతంగా ఎదిగిన వారు మీరు. మీరు చేస్తున్న ప్రజాసేవ గురించి ఒక పుస్తకం రాసి జనానికి పంచాలనుకుంటున్నాను.

మంత్రి : నాగురించి పుస్తకమా?

శ్రీని : అవును. మీ గురించే.. ఆదర్శవంతమైన జీవితం గడుపుతూ.. ఎక్కడ వివాహం చేసుకుంటే మీలో స్వార్థం వస్తుందో అని సంసార సుఖాన్ని ప్రజలకోసం త్యాగం చేసిన ఘనులుమీరు. అహర్నిశలూ ప్రజలకోసం పాటుపడే మీలాంటి వారి చరిత్ర భవిష్యత్తరాలు తప్పకుండా తెలుసుకునే తీరాలి. త్రేతాయుగంలో శ్రీరాముడు అనే రాజుని ఆదర్శపురుషుడిగా వర్ణిస్తూ వాల్మీకి రామాయణం రాశారు. ఈ కలియుగంలో మీలాంటి వారిని ఆదర్శపురుషునిగా భావించి ఏదో నేను ఈ మహత్కార్యం చేపట్టాను.

మంత్రి : అభిమానంతో రాస్తున్నానంటున్నారు. కాదని ఎలా అనగలను. కొన్ని కుక్కల మాటలు విని ఇక్కడ ఇంకేదో జరుగుతుందనుకొని వచ్చాను. నేను విన్నదానికంటే ఇక్కడ జరిగేదానికీ చాలా భిన్నంగా వుంది. అచ్చు వేయించటానిక్కానీ, మీ ఖర్చులక్కానీ డబ్బేమైనా అవసరమైతే..

శ్రీని : ఎంతమాట? రామాయణం రాసినందుకు వాల్మీకి రాముడిదగ్గర డబ్బులు తీసుకున్నాడా..? ఇదీ అంతే.. నా తృప్తికోసం.. నా దగ్గర చదువుకున్న నా శిష్యుడు మంత్రిగా అయినప్పటి నుంచి చేసిన మహత్కార్యాలను వర్ణిస్తూ చేసే రచన.

మంత్రి : అయితే నా సాయం మీరు తీసుకోరన్నమాట..

శ్రీని : సరే.. ఇంతగా మీరు అడుగుతున్నారు కనుక నోరు తెరిచి అడుగుతున్నాను.

మంత్రి : అడగండి మాస్టారూ.. మీరేమడిగినా ఇస్తాను.

రంగ : మీరు వాడినుండి ఒక్క రూపాయి కూడా తీసుకోటానికి వీల్లేదు.

శ్రీని : అబ్బా.. డబ్బుకాదు.. నేను చేసేపనికి ఆయా డిపార్టు మెంట్ల వాళ్ళని సహకరించమని చెప్పండి. ఎందుకంటే పుస్తకం చాలా అందంగా.. మీ గురించి ఎన్నో విషయాలను విశదీకరిస్తూ.. విపులీకరిస్తూ.

మంత్రి : ఆ.. ఆ.. చాలు.. చాలు నాకు అర్ధమైంది. మీపనికి మా వాళ్ళు కానీ, గవర్నమెంటు అధికారులు కానీ ఎవ్వరం అడ్డురాము.. పైగా మీకు సహకరించమని మా మనుషులక్కూడా చెప్తాను. సరేనా..

శ్రీని : మీమనుషుల అవసరం ఏమైనా వుంటే నేనే అడుగుతాను.ముందు గవర్నమెంటు ఆఫీసుల వరకూ నేనడిగిన ఇన్ఫర్మేషన్ ఇమ్మని చెప్పండి.

మంత్రి : తప్పకుండా.. ఈ విజిటింగ్ కార్డు నా మనిషిగా మీకు ఐడికార్డుగా పనిచేస్తుంది. నా ఈ సంతకం (సంతకం చేస్తాడు) రాజముద్ర. ఇది చూపించి మీక్కావాల్సిన ఇన్ఫర్మేషన్ తెచ్చుకోండి. పుస్తకం మాత్రం అద్భుతంగా రావాలి మాస్టారూ.. ఆ పుస్తకం చదివి గుద్దాలి జనం.. ఓట్లు.. వస్తాను.. (మంత్రి వెళ్ళిపోయాడు. మంత్రిని గుమ్మం దాకా పంపించాడు. మంత్రి ఒక్క నిమిషం ఆగి) అన్నట్లు పుస్తకానికేం పేరు పెట్టారు?

శ్రీని : (ఆలోచించాడు. ఏం పేరు చెప్పాలా అని...) మా ఊరి మంత్రిగారు..

మంత్రి : హహహ.. వందల్లో అర్జీలు పెడుతుంటే శతకమేమైనా రాస్తున్నారేమో అనుకున్నా.. మా వూరి మంత్రిగారి శతకం అని పేరుపెడితే ఎలా వుంటుంది మాస్టారూ..

శ్రీని : చాలా బాగుంది. మా వూరి మంత్రిగారి శతకం. ఇదే పేరుతో ఆ పుస్తకం రాస్తాను.. మీ కీర్తి ప్రతిష్ఠల్ని ఇనుమడింపజేసేలా వుంటుంది లేండి..

మంత్రి : ఆ..ఆ.. అలాగే రాయండి.. ఈపుస్తకం ఓ ప్రభంజనమై.. ప్రజల గుండెల్లో చిరస్థానాన్ని పొందాలి.. ఆ రకంగా రాయండి మాస్టారూ... నేనూ మీరుణం వుంచుకోనులేండి.. మన ఊరిని మున్సిపల్ కార్పొరేషన్ చెయ్యాలనే ప్రపోజల్ కూడా వుంది. కార్పొరేటర్ గా మిమ్మల్ని ఏకగ్రీవంగా గెలిపిస్తాను.. మేయర్ ని చేస్తాను. కనీసం యాభైవేల కాపీలు ప్రింటవ్వాలి. మన నియోజకవర్గంలో వున్న ప్రతి ఇంటికీ ఆ పుస్తకం చేరాలి. మీరేం ఖర్చుకి వెనకాడకండి. ఒక వేళ డబ్బు చాలకపోతే నేనే సర్దుబాటు చేస్తాను. మీరేం మొహమాట పడకండి.

(మంత్రి బయటికెళ్ళిపోయారు. వాళ్ళని వీధిలోకి పంపించి శ్రీనివాసరావు వెనక్కి తిరిగి లోనికొచ్చాడు.)

రంగ : అర్థమైంది.. మీరాపని ఎందుకు చేశారో.. మనకి అన్ని వివరాలూ వస్తున్నా.. కొన్ని వివరాలు రావట్లేదు. కారణం మంత్రిగారి పలుకుబడి. ప్రతి చోటా మంత్రిగారి మనుషులుండబట్టే కదా.. మంత్రికి మనం చేస్తున్న ఎంక్వైరీ గురించి తెలిసింది. అందుకని మంత్రి గురువు హోదాలో కార్డు సంపాదించారు. రైట్..

శ్రీని : యస్.. ఈ కార్డు విష్ణుమూర్తి చేతిలో సుదర్శనచక్రం. పరమేశ్వరుడి చేతిలో పాశుపతాస్త్రం.. ఇది మన దగ్గరున్నంతవరకూ మంత్రికి సంబంధించినఅ న్ని వివరాలూ మనమూ తెలుసుకోవచ్చు.

మల్లే : (కంగారుగా ఇంట్లోకి వచ్చాడు..) ఆ మంత్రి ఇక్కడికెందుకొచ్చాడు మాస్టారూ..

శ్రీని : ఏంలేదు చైతన్యా.. మనం మంత్రి గురించి అతను చేస్తున్న పనుల గురించీ ఎంక్వైరీ చేస్తున్నాం కదా.. అది తెలుసుకొని వచ్చాడు.

మల్లే : మీరేమన్నారు?

శ్రీని : ఏముంది? ఉన్నదే చెప్పాను. అతని మీద ఒక పుస్తకం రాస్తున్నానని..

మల్లే : ఏమన్నాడు.

శ్రీని : ఏమంటాడు. రాజకీయనాయకుని బుద్ధి చూపించుకున్నాడు. ఈ పుస్తకం ద్వారా ఈ నియోకవర్గం ఓట్లన్నీ తనకే పడేలా చెయ్యాలని కోరాడు. కావాలంటే డబ్బులు కూడా ఇస్తానన్నాడు. నన్ను మేయర్ ని చేస్తాడట. ఇదిగో అతని విజిటింగ్ కార్డు. (మల్లేశం చేతికి విజిటింగ్ కార్డు ఇచ్చాడు) ఈ కార్డు కేవలం అతని మనుషుల దగ్గర మాత్రమే వుంటుంది. కనుక దీనిని ఉపయోగించి పోలీస్టేషన్లలో, విజిలెన్స్ డిపార్ట్ మెంట్లో చివరికి సిబిఐ ఫీసులో వున్న సమాచారం కూడా మనం సంపాదించుకోవచ్చు. ఈ మంత్రి అనుచరుల నేరచరిత్ర వివరాలు అన్నీ కూడా మనం సేకరించాలి. ఈ కార్డు జాగ్రత్త.. నువ్వే పని సానుకూలం చేసుకొని రావాలి.

మల్లే : అర్థమైంది మాస్టారూ.. ఇన్నాళ్ళూ ప్రజాస్వామ్యానికి వాడు గోతులు తీశాడు. ఈ కార్డు మనకిచ్చి ఇప్పుడు వాడి గొయ్యి వాడే తీసుకున్నాడు.. ఇవి మంత్రి చిన్నతనంలో అనుభవించిన బీదతనం, ఎవరి సాయం ఎలా పొందాడో, ఆ తర్వాత వాళ్ళందరినీ ఎలా మర్చిపోయాడో, స్వార్థంతో మురికి రాజకీయాల్లో ఎలా కూరుకుపోయాడో తెలిపే ఒక వంద విషయాల దాకా వివరాలు సేకరించాను. ఆయన ఇచ్చి నెరవేర్చని వాగ్దానాల వివరాల్లో మెయిన్ వివరాలు ఒక వంద.

శ్రీని : చాలా థ్యాంక్సయ్యా చైతన్యా.. నా కన్నా నువ్వే ఎక్కువ శ్రమపడుతున్నావ్.

మల్లే : అదేం లేదు మాస్టారూ.. శ్రీరాముడు ఆధ్వర్యంలో వానరసమూహం సముద్రంమీద వారధి నిర్మిస్తుంటే ఒక ఉడుత ఇసుకలో పొర్లి ఆ ఇసుకని రాళ్ళమధ్యలో విదిలించిందట.. ఉడత ఒంటికి అంటుకున్న ఇసుక ఏపాటిది. నేను చేసే సేవ కూడా అలాంటిదే. మీరు చేపట్టిన జనచైతన్యం అనే మహా యజ్ఞం కోసం మీరు పూరిస్తున్న విప్లవశంఖారావానికి నావంతుగా చేస్తున్న చిన్న సేవ ఇది. వస్తాను. అర్జంటుగా సి.బి.ఐ, మరికొన్ని పోలీస్టేషన్స్ లో వున్న ఫైల్స్ తీసుకురావాలి. ఈ పాశుపతాస్త్రాన్ని వాడుకుంటాను.. వస్తాను.

శ్రీని : జయీభవ.. దిగ్విజయీభవ.. (మల్లేశం వెళ్ళిపోతాడు.)

రంగ : ఆ చైతన్యని చూస్తుంటే నాకెంతో గర్వంగా వుంది. మనం చేస్తున్న ప్రజాస్వామ్య పరిరక్షణ చైతన్యోద్యమ మహాయాగానికి తానే రుత్విక్కునిగా మారి హోమఫలాన్ని ప్రజలకి అందించబోతున్నాడు.

శ్రీని : అవును. నేను యాగబ్రహ్మనే అయినా ఇతను లేకపోతే నేను అనుకున్నది సాధించగలిగేవాడిని కాను. ఈ చైతన్య కారణ జన్ముడు.

లైట్స్ ఆఫ్

స్పాట్ లైట్ ఆన్

మల్లే : ప్రజలారా..! నేను చైతన్యని.. జాతిని జాగృతం చెయ్యటానికి వచ్చిన చైతన్యాన్ని. అడవుల్లో వుండి మీకోసం పోరాడుతున్న చైతన్యాన్ని.. ఈరోజు మీతో మాట్లాడటానికి వచ్చాను. తెల్లవాడిపై పోరాటం చేయటంలో అర్థముంది..కానీ మనపై మనమే పోరాటం.. ఆలోచిస్తుంటే మనసు ఆవేదన చెందుతోంది. అసెంబ్లీలో పార్లమెంట్లలో ప్రజలసమస్యలకోసం పోరాడకుండా వ్యక్తిగత దూషణలూ.. తిట్లపురాణాలూ... అదేంటని

అడిగితే రాజద్రోహం అంటూ.. ప్రజలగొంతునొక్కేస్తూ లాఠీఛార్జీలు, అరెస్టులూ.. వీళ్ళనా ఇన్నేళ్ళూ మనం ఎన్నుకుంటోంది. పిల్లలు పుడితే స్వార్థం పెరుగుతుందేమోనని కాబోయే స్త్రీకి పెళ్ళికి ముందే పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించి పెళ్ళిచేసుకొని, ఆ తర్వాత ఎంపిగా గెలిచి, పార్లమెంటుకి సైకిల్ పై వెళ్ళిన తన పేరు చివర వున్న రెడ్డి అనే పదం కులాన్ని సూచిస్తుందని ఆ రెండక్షరాల్ని వదులుకున్న పుచ్చులపల్లి సుందరయ్య లాంటి నాయకులెక్కడ... తమ పేరు చివర కులాన్ని తగిలించుకొని కులరాజకీయాలు చేస్తున్న నేటి నాయకులెక్కడ? తాను ప్రధానిగా వున్న సమయంలో కొడుకుకి ప్రమోషన్ వస్తే, తన తండ్రిని బట్టే ప్రమోషన్ వచ్చిందని అనుకుంటారని కొడుక్కి నచ్చచెప్పి ఆ ప్రమోషన్ని తీసుకోనీకుండా చేసిన లాల్ బహద్దూర్ శాస్త్రి గారు ఎక్కడ? తాను అధికారంలో వుండగానే కొడుకులకూ, బావమరుదులకూ, అల్లుళ్ళకూ, అప్పణంగా లక్షల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని, ఆస్తులనీ, గనులనీ దోచిపెడుతున్న నేటి రాజకీయ నాయకులెక్కడ? రాచరిక వ్యవస్థపోయి, ప్రజాపాలన కావాలని రాజ్యాంగంలో రాసుకున్నా.. ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా కుటుంబరాజకీయ వారసత్వం.. ఎంత దారుణం? మనల్ని పరిపాలించటానికి వేరే ఎవ్వరూలేరా..? వీరేనా తరతరాలుగా మనల్ని పరిపాలించేది? వేరే నాయకులే లేరా..? లేరు. తయారు కాలేరు.. ఎందుకంటే వీరు తయారు కానివ్వరు. చెప్పులు కుట్టుకునే అబ్రహాంలింకన్ అమెరికా అధ్యక్షుడు కాగలిగినా.. అలాంటి లింకన్ లు ఇక్కడ చెప్పులు కుడుతూనే వున్నారు. తండ్రిలేని అనాధ అయిన బిల్ క్లింటన్ అమెరికాకి అధ్యక్షుడు కాగలిగినా..అలాంటి అనాధలు మనదేశంలో అనాధలుగానే మిగిలిపోతునే వున్నారు.పేద రైతు కుటుంబంలో పుట్టిన జిమ్మీకార్టర్ అమెరికాకి అధ్యక్షుడు కాగలిగాడు.. కానీ ఇక్కడో రైతులు అధికారం చేపట్టటం మాట అటుంచి కనీసం గిట్టుబాటు ధరలు లేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ వ్యవస్థ మారాలి.. మార్పుకోసం పోరాడాలి.. మార్పుతేవాలి.. అది మనమే తేవాలి. మనకోసమే కాదు.. మన ముందు తరాలకోసం.. ఇన్ని సంవత్సరాలుగా రాని ప్రగతి మేమే సాధించామని ఒకరు, ఇన్ని సంవత్సరాలుగా రాని ప్రగతి మా ప్రభుత్వం ఐదేళ్ళలో తీసుకొచ్చిందని మరొకరు మరల మరలా వస్తునే వుంటారు.. ఎన్నికల ముందు ఎన్నో పథకాలు తెస్తునే వుంటారు.. వాటిని అమలు చేస్తున్నామని కొందరు.. అమలు కాకుండా ప్రతిపక్షాలు అడ్డుకుంటున్నారని మరొకరు.. చెబుతునే వుంటారు.. ఇవన్నీ ఎవరికోసం ..? జనాల బాగుకోసమా... లేక వాళ్ళ బాగుకోసమా.. లంచం ఇవ్వటం తప్పు.. తీసుకోవటమూ తప్పే.. బహిరంగంగా జనానికి ప్రభుత్వడబ్బుని పథకాలపేరుతో పంచుతూ.. ప్రజలకి ఉచితం అనే ఒకరకమైన మానసిక బలహీనతను అలవాటుచేసి, రానున్న ఎలక్షన్లలో తమని గెలిపించకపోతే డబ్బులు రావని ప్రజల్ని భయపెట్టి ఓట్లు కొనుక్కుంటున్నారు.. అధికారంలోకి వచ్చాక తిరిగి ఆ ప్రజల్నే దోచేస్తూ.. కాస్తో కూస్తో ప్రజల మొహాన ఎంగిలి విదిలించినట్లు విదిలిస్తున్నారు.. ఉచితంగా వస్తోంది కదాని ప్రజలు కూడా ఆ ఎంగిలిని అప్పణంగా అందుకుంటున్నారు. ఎవ్వరూ ఎవ్వరికీ ఉచితంగా డబ్బులివ్వటం లేదు ప్రజలారా..? అది మన డబ్బు.. వాడు దోచేస్తున్న డబ్బులోంచి నువ్వు నోరెత్తకుండా వుండటానికి నీకు విదిలిస్తున్న ఎంగిలి లంచం.. ఇన్ని పథకాలు పెట్టినా ఇన్ని సంవత్సరాల్లో ఈ దేశంలోని

పేదరికం ఎందుకు తగ్గలేదు. ఆకలి ఛావులు ఎందుకు తగ్గలేదు? ఆత్మహత్యలు ఎందుకు తగ్గలేదు? ఆలోచించండి.. ఇవి కేవలం రాజకీయ నాయకుల లబ్ధికోసం పెట్టినవే... కాదంటారా?

ప్రజలు : అవును.. అవును...

మల్లే : రాజ్యాంగాన్ని అడ్డుపెట్టుకొని పథకాల పేరుతో పథకం ప్రకారం దోచేస్తున్న మన మంత్రిలాంటి రాజకీయ నాయకులకి సమాధి కట్టేద్దామా..

ప్రజలు : కట్టేద్దాం.. కట్టేద్దాం..

మల్లే : అలాంటి దోపిడీ వ్యవస్థని కూలద్రోసి ప్రజలకు సేవచేసే మంచి రాజకీయ వ్యవస్థని ఏర్పాటు చేయాలి.. మంచితనానికీ, మానవత్వానికి, సేవ చేసేవారికి అడ్డుగా వున్న ప్రజాద్రోహులైన ఈ రాజకీయ శత్రువులని సమూలంగా నిర్మూలన చేద్దామా?

ప్రజలు : చేద్దాం..

మల్లే : శత్రువుని జయించటం అంటే అతన్ని చంపటం కాదు.. ఓడించటం.. అదికేవలం మీ ఓటుద్వారా జరగాలి. కులాల పేరుతో మతాలపేరుతో ఓటుబ్యాంకు రాజకీయం చేసే ఈ మంత్రిలాంటి కంత్రీ వెధవలకి కాలం చెల్లిందని చెప్పేలా ప్రజాబలం ఓటుద్వారా చాటి చెప్పాలి. ఓ లాల్ బహద్దూర్ శాస్త్రిలా, ఓ పుచ్చలపల్లి సుందరయ్యలా.. ఒక కామరాజు నాడార్ లా.. డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ లా.. జ్యోతిరావ్ పూలే లా.. కాన్షీరామ్ లా ఆదర్శంగా వుండగల మంచి నాయకుల్ని , అల్లూరి సీతారామరాజులా, భగత్ సింగ్ లా.. పోరాటపటిమ వున్న యువనాయకుల్ని ఈ ప్రజలకి అందించాలి.. 30కోట్ల జనం వున్న అమెరికా ఈ ప్రపంచంలో అగ్రరాజ్యంగా వుంటే వందకోట్ల జనాభావున్న మనదేశం ఎన్నో వనరులు వుండి కూడా ప్రపంచ అగ్రరాజ్యంగా ఎదగలేక పోవటానికి కారణం కేవలం పాలకుల స్వార్ధమే కాదంటారా? ఈ స్వార్ధ రాజకీయ నాయకుల్ని అంతంచేసి ప్రపంచంలోనే మన దేశాన్ని అగ్రదేశంగా సగర్వంగా నిలబెట్టటానికి మనం సరైన పాలకుల్ని ఎన్నుకుందాం.. మన అన్నలూ, అక్కలూ పంచుతున్న ఆ మావూరి మంత్రిగారి శతకం పుస్తకాల్ని చదవండి.. ప్రజలు పథకాల పేరుతో ఎలా దోపిడీకి గురవుతున్నారో అర్ధమౌతుంది. పథకాలు మాకు రాలేదండీ.. మాకురాలేదండీ.. అంటూ గవర్నమెంటు ఆఫీసులచుట్టూ తిరగటం కాదు.. వాళ్ళిచ్చే పథకాల కోసం మనం బ్రతికిలేం.. వాళ్ళిచ్చే పథకాలకోసం మనం మన పిల్లల్ని కనటంలేదు. వాళ్ళు పథకాలపేరుతో ఇచ్చే డబ్బులతోనే మనం బ్రతకటంలేదు.. ఆ పథకాలపేరుతో నీకు పంచే డబ్బు మీ నుంచి పెద్దమొత్తంలో దోచుకున్నదే.. గుర్తించండి.. పథకాల పేరుతో మాకు డబ్బులు పంచద్దు.. రోడ్లు బాగుచేయించండి.. డ్రైనేజీలు తీయించండి.. విద్యుత్ ఉత్పత్తిని పెంచండి, వ్యవసాయానికి పెట్టండి, పనికొచ్చే పనులు చెయ్యండని నిలదీయండి.. మీ వ్యక్తిగత అవసరాలకోసం తీసుకోకండి.. అలా తీసుకుంటే.. ఆ నాయకుడు నీ భుజాలమీద మరో ఐదేళ్ళకి కూర్చుంటాడు. పార్టీకోసం పనిచెయ్యటం ఆపి మంచి నాయకుడికోసం, మంచి సమాజంకోసం పనిచెయ్యండి.. ఈ పుస్తకాన్ని మీ చుట్టుపక్కల వాళ్ళకుకూడా అందేలా చెయ్యండి.. లాల్ సలాం.. (స్పాట్ ఆఫ్)

(లైట్స్ ఆఫ్ లో.. బయట తుపాకుల మోత వినిపిస్తుంటుంది. ఆగిపోయింది.)

## 9వ సీన్

:: మంత్రి ఇంటి సెట్టింగ్ ::

(మంత్రి పుస్తకాన్ని చేతిలో పట్టుకొని అటూ ఇటూ తిరుగుతున్నాడు...)

తెరలో : అన్నా.. తుపాకులు పెట్టుకొని పుస్తకాలు పంచుతుంటే అనుమానమొచ్చి పట్టుకున్నాం.. తన మందితో మనమీదికి దాడిచేపిచ్చాడన్నా.. ఆళ్ళోళ్ళంతా చచ్చారు. ఈ డొక్కడే ప్రాణాలతో మిగిలాడు.. నువ్వు ఊ అంటే.. ఈడ్నీ...

మంత్రి : చంపద్దు.. వాడ్ని లోపలికి తొయ్యి.. (లైట్స్ వెలిగాయి.. మంత్రి రివాల్వర్ తీశాడు.. చేతులు వెనక్కి కట్టేసిన మల్లేశాన్ని లోపలికి తోసినట్లుగా వచ్చి మంత్రి పాదాలమీద పడ్డాడు. మంత్రి తన బూటుకాలితో మల్లేశం తలని పైకెత్తుతూ..) లేరా.. దొంగనా కొడకా.. ఎవర్రా నువ్వు..

మల్లే : గుర్తుపట్టలేదారా కంత్రీ మంత్రి. అవునులే.. ఎన్ని పాపాలని నువ్వు గుర్తుపెట్టుకుంటావ్.. నాకు ఉద్యోగమిపిపస్తానని నీ మనుషులతో మా పొలం కాజేసిందేకాక లక్షరూపాయలు కూడా కాజేసి నాకు ఉద్యోగమివ్వకుండా.. అదేమని అడిగిన మా అమ్మని కొట్టి చంపావుకదరా.. గుర్తొచ్చానా.?

మంత్రి : గుర్తొచ్చావ్.. చేసిన మేలైనా మర్చిపోతానేమో కానీ.. యదవ పనులు మర్చిపోయేంత యదవని కాను. నీయమ్మ చచ్చిందని నామీద పగబట్టి.. నన్ను చంపాలనుకున్నావ్.. అంతేగా..

మల్లే : కాదు... నిన్ను చంపాలనుకోలేదు.. అదే కనుక చెయ్యాలనుకొని వుంటే.. ఎప్పుడో చచ్చివుండేవాడివి.. నీ నేర చరిత్రని జనానికి చెప్పి నువ్వు నిజం అనుకుంటున్న మంత్రి హోదాని, దాని ద్వారా వచ్చిన గర్వాన్ని చంపేద్దామనుకున్నా..

మంత్రి : అవునా.. ఈ పుస్తకం ఏందిరా.. మా ఊరి మంత్రిగారి శతకం.. మా మంత్రిగారి దుర్మార్గాలకు నిదర్శనం. పంచుకునేదేదో ప్రజలకి పంచకుండా నా మనుషుల ఇళ్ళల్లో కూడా పంచారు.. మీది ఎంత పిచ్చితనంరా.. ఈ ఊరికి నేను మంత్రిగా గత పాతికేళ్లుగా గెలుస్తూ వస్తున్నా.. ఏకగ్రీవంగారోయ్.. అలాంటి ఈ పిచ్చి జనానికి నేను చేసిన అన్యాయం గురించి చెప్తావా.. నువ్వూ ఆ ముసలోడూ నా గురించి పిచ్చి రాతలు రాస్తున్నారని నాకు ముందే తెలుసు.. పుస్తకాలు ప్రింట్ చేయించాలి కదా అని వెయిట్ చేశా.. లోకల్ ప్రెస్సులో అయితే నాకు తెలిసిపోతుందని బెంగుళూరు ప్రెస్ లో వేయించారు. అక్కడ మాత్రం నాకు మనుషులుండరారా.. పుస్తకాలు చదివిన జనం ముందు ఆవేశపడతారు. నేనేం చెప్తానో తెలుసా? అపోజిషన్ వాళ్ళు పనికట్టుకొని నామీద దుష్ప్రచారం చెయ్యటానికి ఇలాంటి చీప్ ట్రిక్స్ ప్లే చేస్తున్నారని చెప్తా.. రేయ్. పాతికేళ్ళుగా గెలిపించుకుంటున్న నామాట నమ్ముతారో.. పాతిక సంవత్సరాలున్న నీమాట నమ్ముతారో చూద్దామా.. నా నియోజకవర్గంలో చాలా ఓట్లు నాకులం వాళ్ళవే.. అభిమానంతో గుద్దేస్తార్రా.. అది నేనంటే..

మల్లే : మారుతున్న కాలం తోపాటు జనం కూడా మారుతున్నారు. ఈ రాత్రి నుంచే ఎలక్షన్ కోడ్ అమల్లోకి వచ్చింది. ఈ పుస్తకం చదివాక ప్రజలతో నువ్వు మాట్లాడలేవు. ప్రచారాలు చెయ్యలేవు. అందుకేరా.. పుస్తకాలు ఇక్కడికి రాకుండా బెంగుళూరు ప్రెస్సులోనే ఇన్నాళ్ళూ ఉంచాం.. నీ రాజకీయ జీవితానికి సమాధి కడుతుందిరా. ఆ

పుస్తకం.. మంచితనం ముసుగులో నువ్వు చేసిన దుర్మార్గాలను ఏకరువు పెట్టి నిన్ను కూలదోసి ప్రజాస్వామ్య సౌధాన్ని తిరిగి నిలబెడుతుందిరా ఈ పుస్తకం..

మంత్రి : పిచ్చోడా.. నీ ప్రజాస్వామ్య సౌధాలు గాడిదగుడ్డూ రాసుకోటానికి, చదువుకోటానికి బాగుంటాయి.. నీకు తెలీని విషయం చెప్తాను విను.. మాలాంటోళ్ళంటే మాటలు కాదురా.. అంగబలం, అర్థబలం, అధికారబలం.. నేరచరిత్ర, మాఫియా సంబంధాలు, ఖాకీల అండదండలూ... మా లాంటి ఖద్దరు పెద్దల్ని కెలకటమంటే తేనెతుట్టెలో చెయ్యి పెట్టటమేరా..

మల్లే : తెలుసురా.. ప్రజలు మిమ్మల్ని ప్రశ్నించినంతకాలం నీలాంటి యదవలు పుట్టుకొస్తారని.. అందుకే మీ పాపాల చిట్టామొత్తం రికార్డు చేశా.. విప్పమంటావా? దేశంలోని 4,807 మంది ఎమ్మెల్యేలూ, ఎంపీల్లో 30శాతం మందికి నేరచరిత్రుంది. అందులో 14శాతం దాకా హత్యలూ, అత్యాచారాల్లాంటి అభియోగాలు ఎదుర్కొంటున్నారు. 1985 నుండి ఈ1995 మధ్య కాలోంల దేశాలోని ఆరు ప్రధాన రాజకీయ పార్టీల మొత్తం ఆదాయం 4,895.96 కోట్ల రూపాయలు. ఇందులో 91.01 శాతం గుర్తుతెలీని వారి విరాళాలు పెద్ద మొత్తంలో వున్నాయ్.. ఈ అంకెలేరా ప్రజాస్వామ్య వ్యవస్థను అపహాస్యం చేస్తున్నాయ్.. శూలాల్లా వెంటాడుతున్నాయి.. గుండెల్ని ఛిద్రం చేస్తున్నాయ్.. మీ అవినీతి పీఠాన్ని పెకలించటానికి క్షరం కాని అక్షరమనే ఆయుధాన్ని పట్టుకొని, మీమీ చీకటి బ్రతుకుల భాగోతాన్ని బయట పెడుతూ, నిద్రిస్తున్న నా యావత్ భారతాన్నీ నిద్రలేపుతుందిరా మా వూరి మంత్రిగారి శతకం..

మంత్రి : నువ్వు చెప్పింది వింటుంటే నా మైండ్ పోతుందిరా.. ఇంత గొప్పగా లెక్కలేశావంటే.. నీ లాంటి మేధావులు ఈ భూమ్మీద వుంటానికే వీల్లేదురా.. (అంటూ తుపాకీ అతనికి గురిపెట్టాడు.)

మల్లే : నాలాంటి వాడు కాదురా.. నీలాంటి వాడే వుంటానికి వీల్లేదు.. (అప్పటికే కట్లు తెంచుకొని మంత్రి మీదికి లేచాడు.. మంత్రి కాలిమీద కాల్చేశాడు..)

మంత్రి : రేయ్ పిచ్చోడా.. ఏ అధికారమూ లేని నీకే అంత బలగాన్ని వేసుకొని నన్ను చంపుదామని వచ్చావే.. అన్ని అధికారాలున్న నాకెంత నెట్ వర్క్ వుండాలిరా..? (మళ్ళీ కాలిమీద షూట్ చేశాడు)

మల్లే : (కిందపడ్డాడు.. ) ప్రజాచైతన్యం ప్రభంజనమై నీలాంటి వారి అధికారాన్ని సమూలంగా నాశనం చేస్తుందిరా.. ఎక్కడ ప్రజలు అణచివేతకు గురౌతారో అక్కడ ఆలోచన పుడుతుంది. ఆ ఆలోచన నుండి తిరుగుబాటు పుడుతుంది. ఎక్కడ తిరుగుబాటు పుడుతుందో అక్కడ ఉద్యమం మొదలౌతుంది. ఎక్కడ ఉద్యం మొదలౌతుందో అక్కడ విప్లవం పుడుతుంది. ఎక్కడ విప్లవం మొదలౌతుందో అక్కడ మార్పుకి మార్గం చూపుతుంది.(మంత్రి మల్లేశం గుండెలమీద కాలుస్తాడు....) సాకీ...

మంత్రి : (మంత్రి మల్లేశం మొహంమీద కాలుపెట్టి...) ఇలాగే.. ఇలాగే.. ఆ ఉద్యమాన్ని మా లాంటి వాళ్ళతో కూడుకున్న అధికారం అణచేస్తుంది. మా ఉక్కు పాదాల కింద ఎంతటి ఉద్యమమైనా నలిగిపోవాల్సిందే...

తెరలో : అన్నా.. ఊరొదిలి పారిపోతుంటే పట్టుకొచ్చామన్నా.. (శ్రీనివాసరావుని ఒక్క తోపు తోశాడు...శ్రీనివాసరావు పరుగులా వచ్చి మల్లేశం దగ్గర పడ్డాడు)

శ్రీని : చైతన్యా.. బాబూ చైతన్యా..

మంత్రి : వాడిప్పుడు చైతన్యంకాదు.. వాడిప్పుడు అచైతన్యం మాస్టారూ.. అయినా గాంధీ, నెహ్రూ పేరు పెట్టుకున్న వాళ్ళు శాంతి కపోతాలూ, చంద్రశేఖర్ ఆజాద్, భగత్ సింగ్ అని పేర్లు పెట్టుకున్న వాళ్ళు విప్లవసింహాలు అయిపోతారా. వీడూ అంతే.. అయినా వాడు చైతన్యకాదు.. మల్లేశం.. ఉద్యోగం కోసం నా చుట్టూ కుక్కలా తిరిగిన రంగమ్మ ఒక్కగానొక్క కొడుకు మల్లేశం. ఏం పంతులూ నీకెంత ధైర్యముంటే వీడిని నన్ను చంపటానికి నామీదకే ప్రయోగిస్తావ్..? నేనారోజు మీ ఇంటికొచ్చిందెందుకో తెలుసా.. నువ్వు చెప్పే పిట్టకథలు వింటానికనుకున్నా.. మీరందరూ కలిసి నామీద నిశ్శబ్ద విప్లవం మొదలెట్టారనే వచ్చాను. అయినా నీకు ఎంత ధైర్యముంటే నాకే నెగెటివ్ గా పుస్తకం రాస్తావ్. ఈ పుస్తకంతో నన్ను నువ్వేం చెయ్యగలవు. ఎవరికోసం ఇదంతా చేశావ్.. ప్రతిపక్షాల వాళ్ళు ఎంతిచ్చారు. చెప్పు.. ? చెప్పు.. ఎవరు రాయమన్నారు? ఎందుకు రాశావ్?

శ్రీని : ఇది నీకోసమో, నాకోసమో రాసిందికాదు. ప్రజలకోసం రాసింది. ప్రజల్ని ప్రభావితం చెయ్యటం కోసం రాసింది. నువ్వు ప్రజల రక్తమాంసాలతో, వాడిన వారి బ్రతుకులతో కట్టుకున్న నీ రాజకీయ కోటకి ఈ " మా ఊరి మంత్రిగారి శతకం" పుస్తకం బీటలు వారేలా చేస్తుంది.. ఖబడ్దార్.

మంత్రి : శభాష్ పంతులూ.. శభాష్.. న్యూస్ పేపర్ చదవటానికే జనానికి టైంలేదు. అలాంటిదీ పుస్తకం చదవటానికి జనానికి టైం ఎక్కడుంటుంది. అయినా చదివి జనం నన్నేం చేస్తారు.

శ్రీని : ఓరి పిచ్చోడా.. ఒక్క సిరాచుక్క లక్షల మెదళ్ళను కదిలిస్తుంది. వాళ్ళ ఆలోచనల్లో ఆవేశాన్ని రేకెత్తిస్తుంది. ఒక గడ్డిపోచ దుర్భలమైతే, వేయి గడ్డిపోచలు దుర్భేధ్యమై మదపుటేనుగునే కట్టిపడేస్తాయి. నువ్వెంత.?

మంత్రి : నీ ఒక్కడి వల్ల .. అదీ నువ్వు రాసిన పుస్తకంవల్ల.. హహహ.. ఇదంతా జరుగుతుందనే పిచ్చి కలలు కంటున్నావా.. మాస్టారూ..

శ్రీని : నన్ను ఒక్కడే అనుకుంటున్నావా మంత్రీ.. నేను ఒక్కడిని కాదు.. చైతన్యాన్ని..

మంత్రి : నువ్వనే ఆ చైతన్యం ఏమైందో చూశావుగా..

శ్రీని : పిచ్చోడా.. నువ్వు కాల్చింది వ్యక్తిని.. శక్తిని కాదు.. ఆ శక్తికి కారణమైన చైతన్యాన్ని కాదు.. పెల్లుబికి వస్తున్న ప్రజాచైతన్యాన్ని నువ్వు ఆపలేవు.

మంత్రి : నాలుగు సంక్షేమ పతకాలు నెరవేరుస్తానని హామీల వర్షం కురిపిస్తా.. నువ్వనే ఆ చైతన్యాన్ని చల్లారుస్తా.. చేస్తానా.. చెయ్యనా అని కూడా ఆలోచించరు.. పిచ్చి జనం వెర్రి గొర్రెల్లా ఓట్లు గుద్దేస్తారు. మళ్ళీ మేమే అధికారంలోకి వస్తాం.. (బయట గొడవ వినిపిస్తుంటుంది. బయట నుంచి)

తెరలో : అన్నా.. జనాన్ని కంట్రోల్ చెయ్యలేకపోతున్నాం.. అందరూ పుస్తకాలు పట్టుకొని మిడతల దండులా వస్తున్నారు..

శ్రీని : అదిగో.. అదిగో వినిపిస్తోందా.. ప్రజాగర్జన.. ప్రభంజనంలా నీ అధికార అహంకారపు కోటని కూలదొయ్యటానికి వస్తోంది.. విను.. విను..

మంత్రి : యేయే.. పంతులూ ఏంటి ఇదంతా..

శ్రీని : నువ్వే అన్నావుగా ఇందాక.. నిశ్శబ్ద విప్లవం.. మార్పుదిశగా అడుగులేస్తోంది. నిన్ను బయటికి రమ్మని పిలుస్తున్నారు. వెళతావా బయటికి.. వెళ్ళు.. ఇక్కడేదో పెల్లుబుకుతున్న చైతన్యాన్ని అణచేస్తానని, హామీల వర్షం కురిపిస్తాననీ అన్నావుగా.. వెళ్ళి హామీలివ్వు.. చైతన్యాన్ని చల్లార్చు..

మంత్రి : నిన్నూ... నిన్నూ.. (తుపాకీ మాస్టారికి గురిపెట్టాడు..)

శ్రీని : చంపేస్తావా.. చంపెయ్.. మావూరి మంత్రిగారి శతకం పుస్తకం రాయాలనుకున్నప్పుడే నాకు తెలుసు నీ చేతుల్లో చనిపోయే రోజు వస్తుందని. కానీ ఇప్పుడు నాకు తెలుస్తుంది. నేను చనిపోనని.. పుస్తకం రూపంలో ప్రజల గుండెల్లో చిరంజీవినై చిరస్థాయిగా వుండిపోతానని.. చూడూ నన్ను చంపినా నువ్వు ఛస్తావ్.. చంపకపోయినా జనం చేతికి చిక్కినా ఛస్తావ్.. రేయ్.. నాదగ్గర చదువుకున్న నీకు చరిత్ర పాఠాలైతే చెప్పాను కానీ, భవిష్యత్తు ఎలా వుంటుందో చెప్పలేదు కదూ.. ఆఖరి పాఠం చెప్తాను శ్రద్ధగా విను. తిరుగుబాటుకి చైతన్యమేరా ఇరుసు. ఇరుసెప్పుడూ అరిగిపోతుందే తప్పఇరిగిపోదు. గమనాన్ని ఆగిపోనివ్వదు. దానికి నిదర్శనమే ఆ ప్రజాగర్జన. నువ్వు బ్రతకాలంటే ఒక్కటే మార్గం..

మంత్రి : ఏంటి మాస్టారూ...?

శ్రీని : (పెద్దగా నవ్వాడు..) ఒరేయ్.. ఒరేయ్.. నువ్వింకా బ్రతకాలనే అనుకుంటున్నావా? ఇంకా బ్రతకాలనే వుందా..? అయితే విను.. ఏ ప్రజలు నువ్వు మంచి వాడివని నమ్మి నిన్ను తమ ప్రతినిధిగా ఎన్నుకొని గెలిపిస్తున్నారో.. అదే ప్రజల ముందు నువ్వు చేసిన తప్పులన్నీ ఒప్పుకొని చెంపలేసుకొని లొంగిపోరా.. కనీసం ప్రాణాలతో అయినా మిగులుతావ్.. పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తంలేదు.. నువ్వు సంపాదించిందంతా ప్రజలకే ఇచ్చెయ్.. ఇదే.. ఇదే.. నేను నీకు చెప్పే ఆఖరి పాఠం.

మంత్రి : (తుపాకీ తీసుకొని తన తలకే గురిపెట్టుకుంటాడు) అలా లొంగిపోయే కంటే చచ్చిపోవటమే నయం.. మాలాంటి నాయకులు బ్రతికేదే అధికారం కోసం.. ఒక్కసారి అధికారానికి అలవాటు పడిన వాడు అది కోల్పేతే చచ్చిపోయిన పూడుపాముతో సమానం. నీలాంటి వాళ్ళు దేశానికి ఒక్కడున్నా మాలాంటి నాయకులు పుట్టుకురారు. మాస్టారూ.... మా ఊరి మంత్రిగారి శతకం.. గురించి నేనన్నట్లుగా పెద్ద ప్రభంజనమే అయింది. ప్రజాచైతన్యం కలిగించింది. జనం చేతిలో చచ్చేకంటే నాకు నేనుగా ఛస్తేనే గౌరవం. (కాల్చుకున్నాడు)

(సాకీ...)

వాయిస్ : ఇది దాదాపు ముప్పై ఏళ్ళక్రితం జరిగిన ప్రజాచైతన్యపు మా ఊరి మంత్రిగారి శతకం కథ. కానీ నేడు మరో రకంగా మారింది. సాంకేతిక విప్లవం మొదలైంది. బ్లాగులనీ, యూట్యూబులనీ, ఫేస్ బుక్కులనీ, ట్విట్టర్లనీ వివిధ రకాలుగా ప్రజలు అప్ డేట్ అవుతున్నారు. అందుకు తగినట్లుగానే రాజకీయనాయకులూ దోపిడీ విధానంలో అప్డేట్ అవుతున్నారు. మరిలాంటి సమయంలో మరోసారి శ్రీనివాసరావు, చైతన్యలా మారిన మల్లేశం లాంటి వారు పుట్టుకు రావాలని కోరుకుందామా.. లేక మనమే వీరిలా మారదామా? నిర్ణయం మీ ఇష్టం..

# శుభం